# అమరసింహుఁడు

ఉన్నత పాఠశాలల ఉపయోగార్థము

గ్రంథకర్త
శేతపూడి వేంకట శివరావు, బి. ఏ., ఎల్. టి.,
ప్రధానోపాధ్యాయులు, తాలూకా హైస్కూలు, తెనాలి




ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)
మద్రాసు :: తెనాలి :: సికింద్రాబాదు

 1952 [ వెల : రు. 1—4—0

# తొలి పలుకు

పలువురు త్యాగమూర్తుల సేవాఫలముగ లభించినది భారత దేశ స్వాతంత్ర్యము. ఆ స్వాతంత్ర్యమును సుస్థిర మొనరించు కొను భారము ప్రతి భారతీయునిపై నున్నది. ఆ గురుతర బాధ్యతను గుర్తింపఁజేయు విద్యార్థుల నుత్తమ పౌరులనుగాఁ దీర్చి దిద్దుట పెద్దల విధి. ఆ విధి నిర్వహణమె నేఁటి నూతన విద్యా ప్రణాళికా ప్రధానాశయము. ఆ యుదాత్తాశయమును సఫల మొనరింపవలయు నన్న, నుత్తమాదర్శములను జూపు గ్రంథ ములు నెంతయో యావశ్యకము లను భావమే నన్నీ రచనకుఁ బ్రేరేపించినది.

•

చరిత్ర పునఃపునరావృత్త మగుచుండును. కాన ముందెఁ గినవాఁ డేమార్గమున నడచి గర్తమునఁ గూలెనో గ్రహించి వెనుకఁ బోవువాడు సన్మార్గ మవలంబింప వచ్చును. కావున సుప్రసిద్ధమగు చారిత్రక సన్నివేశమే యిందుఁ జిత్రింపఁబడినది. స్వార్థపరుల యమానుషకృత్యములును, పౌరుల యనైక్యతయు జాతినాశమునకును, దేశవిచ్ఛిత్తికిని గారణములయ్యె ననుట నిశ్చితార్థము. ఆ యంశమునే యుంపలి కథాంశము వ్యక్తీక రించుచున్నది.

ఏ కాలమునను స్వార్థము నెఱుంగక, జాతిభద్రతయు దేశ కల్యాణమును బేకూర్పనెంచి తమ జీవితమును మాతృదేవి చరణముల కంకిత మొనరించువారుఁ గలరు. అనంగపాలికల

నూఁగఁదగిన యభిప్రాయమును దుర్భర కష్టసంతప్త
రించి, మతసామరస్యమును జేకూరిచి విశ్వమానవ
తృత్వమును సముపార్జించువారును గలరు. అట్టి
యిందును చిత్రింపఁబడిరి. వారి నాదర్శముగాఁ గొని పా
దేశసేవారతు లగుదురని విశ్వసించుచున్నాను.

సహృదయులు మనసుకలిసి నాకృతి నాదరించిన,
దేవీచరణమున నా యర్పించిన సుమము పరిమళిం
యని యానందింతును.

తె నా లి
21—11—51

ర చ యి త
బేతపూడి వేంకట

# ఇష్ట దేవతా స్తుతి

శ్రీ విఘ్నరాజం గిరిజాతనూజం
లంబోదరం పాపహరం గణేశం ।
గ్రంథస్య నిర్విఘ్నసమాప్తి మిచ్ఛన్ ।
విఘ్నాంధకారార్క మహం స్మరామి ॥

గోవిందం మునిబృందవందితపదం సామ్రాజ్యసంపత్ప్రదం ।
ధేనూ గ్గోపవధూశ్చ వేణునినదైః సమ్మోదయంతం విభుం ।
లీలామానుషవిగ్రహం శుభకరం కారుణ్యరత్నాకరం ।
వందే బాలముకుంద మీశ మనిశం సంకల్పసంసిద్ధయే ॥

గోపాలం గోపికాలోలం - భక్తానాం మోక్షదాయకమ్ ।
సర్వాంతర్యామినం కృష్ణం - వందేఽహం నందనందనమ్॥

పార్వతీశ మఘమేఘమారుతం
భక్తకల్పతరు మీశ్వరం హరమ్ ॥
గ్రంథకార్యపరిపూర్తయేఽనిశం
నౌమి సాంబశివ మిష్టదైవతమ్॥

సరస్వతీ వసే ద్వక్త్రే - వాక్శక్తించ మనోబలమ్ ।
సర్వదా శారదా దద్యాత్ - సుప్రసన్నా సదా మమ ॥

# విషయసూచిక

# అ మ ర సిం హుఁ డు

## రా జ్య ప్ర శ స్తి

శ్రీమదఖండ భరతఖండంబున భారతమాత వక్షఃస్థలం బలంకరించు హారావళియనం జెల్లు హారావళి పర్వతములచెంత రాజపుత్రరాజ్యములలో మేటియగు మేవాడు రాజ్యంబు విరాజిల్లుచుండె. తక్కిన రాజ్యంబు లన్నియు మొగలు సామ్రాట్టులకుఁదలయొగ్గి, వారి సార్వభౌమత్వము నంగీకరించి, వారికిఁ గప్పంబు చెల్లించుచున్నను, మేవాడురాజ్య మొక్కటియె తలయెత్తుకొని లెక్కలేని యిక్కట్టులకు లోనయ్యు నిజ స్వాతంత్ర్యము కొఱకే తుదివఱకు ఘోరాతి ఘోరముగఁ బోరాడుచు నేయుండె. శత్రువుల కభేద్యంబుగనుండిన చిత్తూరు దుర్గము మొగలుల వశమైనను రాణా ఉదయసింహుఁడు ధైర్యము వీడక, యా ప్రదేశమును విడనాడి, భీకరారణ్యముల మధ్య నుదయపురంబను పురవరంబును నిర్మించి, స్వాతంత్ర్య సమరమునకే తన జీవితము నంకితము చేసెను.

అతని పుత్రుఁడు ప్రతాపసింహుఁ డాతని కెందును దీసిపోక, తండ్రికాలమున శత్రుహస్తగతమైన చిత్తూరును మగుడ స్వాధీనము చేసికొనుటకు నిశ్చయించెను. అతఁడు రాజైనపు డతనికి రాజ్యములేదు. ధనములేదు. సైన్యమునులేదు. కాని అక్బరు సామ్రాట్టుముందుఁ దలవంచనని ప్రతిజ్ఞ చేసెను. హల్దీఘాటు యుద్ధమున నెందఱో యోధాగ్రేసరులు మడిసిరి. దేశమంతయు ధ్వంసమయ్యెను. కాని యాతఁ డీ నష్టముల నించుకైన లక్ష్య

పెట్టలేదు. ఎంతహాని సంభవించినను సరియే, దాస్యముతో జీవనము గడపుట మంచిది కాదని యెంచి, క్షుద్బాధను గూడ లెక్కచేయక కొలఁదిమంది యనుచరులతో నడవి కేగి, యచట రహస్యముగ భిల్లులను సేనలోఁ జేర్చుకొని తన బలమును బెంపొందింపసాగెను. ఆతని హృదయము దేశభక్తిపూరిత మగుటవలన, నీకష్టము లాతనికిఁ గష్టములుగఁదోఁచవయ్యెను. మేవాడు సంపూర్ణస్వతంత్రరాజ్య మగువఱకు భోగవిలాసము లను బరిత్యజింప నిశ్చయించి, వెండి, బంగారు పాత్రలలో భుజించుటకు బదులు విస్తరిలో భోజనము చేయుదునని ప్రతిజ్ఞఁజేసెను. మృదుశయ్యలను వదలి గడ్డిగాదర పోగుచేసి, కఠినమైన నేలపై నిద్రింపఁ బ్రతినపట్టెను.

ఇట్టి స్థితిలోఁ గూడ నక్బరుసేన లతనిని వెంబడించుచునే యుండెను. తుద కీతఁడేమియుఁ జేయనేరక, కన్నీళ్లు విడచుచు తన జన్మభూమి కంతిమప్రణామంబుఁజేసి, వెడలిపోవ నుద్యుక్తుఁ డగుతఱి, నాతని పూర్వమిత్రుఁడగు భామాశాహుఁ డతనిని వెదకుచువచ్చి, తనజీవితకాలమంతయుఁ గూడఁబెట్టిన మొహరీల సంచి నతని పాదములకడ నర్పించి, 'ఈ ధనముతో మేవాడును రక్షించు' మనెను. ఆతని దేశభక్తికిఁ బ్రతాపుఁ డానందబాష్ప ముల విడిచి, మొదట నా ధనమును గైకొన నిరాకరించియు నెట్టకేలకు నాతని బలవంతముచే నా ధనమును గ్రహించుట కియ్యకొని, ఆ ధనముతో మరల సేనను సేకరింప సమకట్టెను. అప్పటికి నడవిలో దాగియున్న యతని యనుచరులు స్వామి భక్తిపరాయణు లగుటంజేసి, మాతృభూమికొఱకై తమప్రాణ ముల సైతము సమర్పింప సంసిద్ధులై యాతని దరిఁజేరిరి. వారందఱు వినుచుండఁ బ్రతాపుఁడు, "నిలువ శక్తియున్నంతె

వఱకును. కంఠమున నూపిరాడునంతవఱకును, చేత ఖడ్గమున్నను, లేకున్నను, గోళ్ళతోను, దంతములతోను బోరుచుండెదము. కాని యుద్ధభూమినుండి వెనుకంజవేయ"మనిఁ గంభీరముగ బలికినంత, నా వీరుల హృదయముల నూతనావేశ మావరించెను. భయంకర యుద్ధమున రాణాప్రతాపుఁడు గెల్చెను. పోయిన మేవాడు తిరిగి యాతని చేతులలోనికి వచ్చెను. 'రాణాప్రతాప్ కీ జయ్' అను ధ్వనులు మిన్నుముట్టెను.

ఒకప్పుడు ప్రతాపుని తమ్ముఁడగు శక్తిసింహుఁడు తానక్బరు కొలువులోనుండు కాలమునఁ దన ప్రభువగు మొగల్ చక్రవర్తి పక్షము నవలంబించి, తన సోదరుఁడనియైన సంకోచింపక ప్రతాపుని బట్టి శత్రువుల కప్పగించుటకు నాతని వెంబడించెను. రాణాప్రతాపుఁడు తనకుఁ బ్రాణప్రదమైన "చేతకి" యను సైంధవరాజంబు నారోహించి వాయువేగ మనోవేగములతోఁ బాఱిపోవుచునే యుండెను. ఎదుట దుస్తరమగు నొక నది దారి కడ్డువచ్చెను. అంత రక్షణోపాయంబుఁ గానక యొకింత చింతిలుచున్న స్వామి యాలోచనను వెంటనే గ్రహించి యా చేతకి చూపరుల కచ్చెరువుఁ గొలుప నా నదీ పరంబును త్రుటిలో లంఘించెను. కాని యా పాటునకుఁ దాళఁజాలక యది తన యసువులఁ బాసెను.

ఇదియంతయు నిశ్చేష్టుఁడై వీక్షించుచున్న శక్తిసింహుఁడు, "ఆహా! యుక్తాయుక్త వివేకజ్ఞానశూన్యమగు జంతువయ్యు నీ తురంగము తన స్వామిని శత్రువునుండి రక్షించుటకుఁ దన ప్రాణముల సైతము మర్పించెను. దానికున్న జ్ఞానము నాకు లేశమైన లేకపోయెనే! చిన్నతనమునుండి నన్నుఁ బెంచి, పెద్ద

వానినిగఁ జేసిన నా యనుఁగుసోదరుని శత్రువుల కప్పగింప సమకట్టితినే ! ఎంత నీచుఁడను ! ఎంత కృతఘ్నుఁడను !" అని యెంతయుఁ జింతించి, పశ్చాత్తప్తహృదయుండై, తన సోదరుని సమీపించి, యశ్రుపూరితనేత్రుండై యాతని క్షమింప వేఁడు కొనియెను.

దాస్యము, నిరాశ యను గాఢాంధకార మావరించియున్న యాదినములలో రాణాప్రతాపునిజీవితమంతయు వనవాసమునఁ గడచినను నది యొక దివ్యజ్యోతియై స్వాతంత్ర్యసాధమునకు మార్గదర్శకముగ నుండెను. కాన మేవాడు రాజ్యప్రశస్తికి నా వీరవరుని జీవితముకన్నఁ బ్రబలనిదర్శన మేమి కావలయును ?

## గోవిందుని యుపదేశము

ప్రతాపసింహుని యనంతర మాతని పుత్రుఁడగు నమర సింహుఁడు సింహాసనము నధిష్ఠించెను. ఇతని కాలమున నెన్నిమోసాల్లు ముగలులు మేవాడురాజ్యముపై దండెత్తిరి. ఇంతవఱకు మేవాడు సేనలే గెల్చుచుండినను, రాజపుత్రుల కపారనష్టము కల్గుచుండెను. ఇంత నష్టమునకు లోనగుచుఁ జిన్నరాజ్యమగు మేవా డెంతకాలము మహాసముద్రమువలె నున్న ముగల్ సేనతో యుద్ధము సాగించఁగలదు ?

ఈ విషయమును గ్రహించిన యమరసింహుఁ డప్పటికైన మిగిలియున్న తనరాజ్యమును, బ్రజలను గాపాడుటకైన శత్రువు లగు ముగలులతో సంధిఁ జేసికొనఁ గృతనిశ్చయుఁడై, తన రాజ్యములోని ప్రముఖుల యభిప్రాయ మెట్లుండెనో తెలిసి కొనుటకై, వారిని రావించి, పేరోలగముండెను. అందు సామంతు

లును, సేనాధిపతులును నుపస్థితులైరి. వారినుద్దేశించి యమర భూవరుఁడు, "మిత్రులారా! నేటివఱకుఁ దండోపతండములుగ మనపై మాటిమాటికి విఱుచుకొని పడుచున్న శత్రుసేనల నోడించి వెనుకకుఁదరిమి ఈశ్వరానుగ్రహమున మనము గెల్చుచునే యుంటిమి. కాని మనమెంతయో నష్టపడి జయమును సాధింపఁ గల్గితిమి. ఇట్లెంతకాలము వారితో యుద్ధము చేయుచునుండగలము? ఇప్పటికైన మనము వారితో యుద్ధముచేయ విరమించిన మనకు శాంతి సౌఖ్యములు కలుగఁ గలవు. లేకున్న సర్వనాశనమగును. వారా, యుద్ధము మానునట్లు కనుపించదు. ఇఁకముందైన నీరక్తపాతము నరికట్టవలెనన్న వారితో సంధిచేసికొనుట తక్క వేరొండుపాయంబు కానరాకున్నది." అని విషాదముతో ఖిన్నవదనుఁడై పలికి మిన్నకుండెను. అంత సామంతులలో నొకఁడగు జయసింహుఁడు, "మొగలుసేనలు మేవాడుపై దండెత్తినపుడు మనము వారితో యుద్ధముచేయక యెట్లూరకుండఁ గలము? ప్రియమాతృభూమి శత్రులపాలఁ బడఁబోవుచుండ నామెను రక్షించుట మనవిధి కాదా?" అని ప్రశ్నించెను.

"ఇంత చిన్నరాజ్యము ప్రచండమైన మొగల్ సేనల నెట్లెదిరించగలదు?" అని రాణా యడిగెను.

మఱియొక సామంతుఁడగు భీమసింహుఁడు, "మహారాజా! వీరాగ్రేసరులగు నీ సామంతులు మీయండనుండ మీకీ విచారమేల? ఒక చక్రవర్తి కాదు, ఎంతమంది యేకమై మనమీఁది కెత్తివచ్చినను లొంగము. ప్రాణములనైన నిత్తుముకాని రిపులతో నవమానకరమగు సంధి కిచ్చగింతుమా?" యని బదులు చెప్పెను.

రామదాసను సామంతుఁడు లేచి, "మహాప్రభూ! ప్రస్తుతము మొగలులతో సంధిచేసికొనుట తప్ప మఱియొక మార్గము లేదని తాము సెలవిచ్చితిరి. ఇంతకన్న విషమతర పరిస్థితులలోఁ దమజనకుండగు ప్రతాపన్నృపాలుఁడేమిచేసెనో తామెఱుంగరా? మొగలులతో సంధిమాటఁ గలలోనైనఁ దలంచెనా? ఆమహానుభావుఁ డిట్టిచెనిస సంధిప్రయత్నమునైనఁ జేసెడివాఁడా?" అని గంభీరముగాఁ బలికెను.

అంతట రాణా, "పూజ్యుఁడగు మజ్జనకుఁ డొకయసాధారణ వ్యక్తి. ఆయన కేవల మీశ్వరావతారమని చెప్పనచ్చును. అట్టి యమానుషప్రజ్ఞయు, నట్టి దైవీశక్తియు నాయనకే కలవు కాని మనబోంట్లకుండునా? ఆయన నవతారముల శ్రేణిలోఁ జేర్చవలసి యుండును. ఆయన కెందును మనము సాటికాము." అని నుడివెను.

మానవర్మయను సామంతుఁడు నిలఁబడి, "స్వామీ! తాము సెలవిచ్చినట్లు ప్రతాపసింహుని సరిబోలఁగలవా రెవ్వరును మనలో లేరు. కాని యామహాపురుషు నవతారముల శ్రేణిలోఁ బడవైచి, మనము నిజకర్తవ్యము నుపేక్షించనగునా? ఆయన కనుఁగూపులగు తామాయన మార్గమునే యనుసరింతురని నా దృఢవిశ్వాసము. ఆయన మేవాడురక్షణకై తన ప్రాణముల నర్పించె. ఇఁకఁ దాము యుద్ధముచేయకయే మొగలుల యధికారమును స్వీకరింతురా?" అని పలికెను. ఇట్లు సామంతు లందఱును సంధిప్రయత్నమునకు విముఖు లగుటం జేసి, యమరభూపాలుఁడు కింకర్తవ్యతామూఢుఁడై మేవాడు ప్రధానసేనాధిపతియుఁ సాలుంబ్రాధిపతియు నగు గోవింద

సింహునివైపు తిరిగి. "సేనాపతీ! యీ క్లిష్టపరిస్థితులలో మొగలుల యధికారమును నామమాత్రముగ నంగీకరించి, వారికిఁ గప్పము చెల్లించుచు, మేవాడుప్రజల శాంతిభద్రతల రక్షించుచుటయా, లేక బలవంతులగు శత్రువులతోఁ బోరి సర్వముం గోల్పోవుటయా, యేది మీకు సమ్మత"మని యడిగెను.

అవ్వుడు వయోవృద్ధుఁడగు గోవిందుఁ డులికిపడిలేచి తన ప్రభువుతో, "మహారాజా! తాము పేర్కొన్న శాంతి, సుఖము లనునేమో నా కర్థముకాకున్నది. నేను బుట్టినది మొదలు కష్టములనే యెఱుఁగుదును. మీ తండ్రియగు మహారాణాప్రతాపుని పక్షమున సంవత్సరముల కొలఁది నిరంతరము యుద్ధములఁ జేయుచునే యుంటిని. ఆయనతోఁబాటు వన పర్వతములందు నిద్రాహారములనుగూడఁ బరిత్యజించి తిరుగుచునే యుంటిని. దాస్యముతోఁ గూడిన సుఖశాంతులకన్న, స్వతంత్రజీవితములోఁ గల కష్టపరంపర యమృతతుల్యము కదా! భీకరరణవాద్య ధ్వనులచేఁ బరవశులై పోరు యోధులను, మాతృభూమికై యురిత్రాటినైన ముద్దుపెట్టుకొను దేశభక్తులను, స్వదేశమునకై నవ్వుచుఁ బ్రాణములఁ బాయు ధీరులను గాంచితిని. సంధియన నేమో నా జీవితములో నెఱుంగను" అని యుద్రిక్తమానసుఁడై వచించె.

అంతట రాణా, "సేనానీ! నీవు చెప్పిన దంతయు సత్యమే. కాని యీ వృథా రక్తపాతమునకు నా మనం బేలాగో సమ్మతించకున్నది. మొగల్ దూతను బిల్చి సంధి ప్రయత్నము గావింపుము." అని నొక్కి వక్కాణించె.

నావుడు గోవిందుఁడు, "తొల్లి కురుక్షేత్ర సంగ్రామప్రారంభమున స్వజనహత్యకు విముఖుఁడై కారుణ్యదోషోపహత

స్వభావుఁడైన పార్థునకు నాగోవిందుఁడు, 'క్షత్రియుఁడవయ్యును యుద్ధవిషయమున నింతగా సందేహింపఁ జనదు. క్షత్రియునకు ధర్మయుద్ధముకన్నను శ్రేయస్కరమైనది మఱియొకటి కలదా? అప్రయత్నముగ నిట్టియుద్ధము పుణ్యాత్ములగు క్షత్రియవీరులకే లభించును. యుద్ధమున గెల్చితివా, రాజ్యభోగము ననుభవింపఁగలవు. మరణించితివా, వీరస్వర్గము చూఱగొందువు. లెమ్ము. యుద్ధమునకుఁ గృతనిశ్చయుఁడవు కమ్ము.' అని యుపదేశించెను. ఇప్పు డీ గోవిందుఁ డంతకన్న మఱ యేమి చెప్పఁగలఁడు ?" అని యుత్తేజితుఁడై పలికెను.

అంత రాణా, గోవిందుని యుపదేశముచే సమరోన్ముఖమానసుఁడయ్యు, 'నిప్పుడు యుద్ధమనిన నాకు నూతనోత్సాహము కలుగుచున్నది. కాని మనకు సేన లెక్కడినుండి వచ్చునా' అని దీర్ఘముగ నాలోచించుచుండ మెఱుపుతీగవలె నతివేగముగాఁ బరుగులెత్తుచుఁ గాషాయాంబరధారిణి యగు నొకస్త్రీ యా సభాభవనముఁ బ్రవేశించి, చింతాక్రాంతుఁడై యున్న రాణా విచారమును గ్రహించి, "మహారాజా! మీ కీ చింత వలదు. యుద్ధమునకు సిద్ధపడుఁడు. సేనలను నేను బోగుచేసెదను. అప్పటికిని మీరు వెనుకాడిన సేనలను నేనే నడిపెదను" అని గంభీరముగా భాషించెను. ఆమె ధైర్యగాంభీర్యములకు నాసభ్యులందఱు నాశ్చర్యపడిరి. రాణా తన యబలభావమునకు సిగ్గుపడి, 'అమ్మా! అబలవయ్యుఁ బురుషులకు సిగ్గువచ్చునట్లు మాటలాడితివి. నీ వెవరవు ?' అనవిని యామె "మేవాడు రాజ్యమందలి పట్టణములలోను బల్లెలలోను దిరిగి, ప్రజలయందు దేశభక్తిని వీరత్వమును బ్రోత్సహించు గీతములఁ బాడుచుండు దానిని. ప్రస్తుతము నన్నుగుఱించి మీ కింతకన్నఁ జెప్పఁ

జాలను." అని బదులు చెప్పెను. ఆవీరనారీమణి పలికిన యుద్రేక పూరితవాక్యముల వినినంతనే గోవిందసింహునకుఁ దనలో నూతన యౌవనము ప్రవేశించినట్లు తోఁచెను. అతని హృదయ మానందోత్సాహములతో వెల్లివిరిసెను. అది గమనించి రాణా యాతనికి యుద్ధసన్నాహముఁ జేయ నానతిచ్చెను. 'రాణా అమరసింహాకీ జయ్' అను ధ్వనులతో నా సభాభవనము మారుమ్రోగెను.

## ప్ర బో ధ ము

ఒకనాఁడు ప్రభాతసమయంబున నుదయపుర ప్రముఖుల నొక్కచోఁ సమావేశపఱచి, సూచారిణి తన సహచారిణులతోఁ గలిసి మృదుమధుర కంఠస్వరములతో శ్రోతల వీనులకు విందుఁ జేయుచుఁ, బాషాణహృదయంబునైన గరగింపఁజాలిన భావోద్రేకముతో జాతీయగీతంబులఁ బాడి, యాసభలో నిలువఁబడి యిట్లుగంభీరముగ నుపన్యసించెను. "సోదరులారా! పురప్రముఖులారా! నేఁడు మన కొక పరీక్షాసమయము. మన ప్రియ మాతృభూమియగు మేవాడు శత్రువులపాలగుటకు సిద్ధముగ నున్నది. తక్కిన రాజపుత్రరాజ్యములన్నియు వారికి 'దాసోహ' మ్మనినను మనరాజ్యము మాత్రము పూర్వము నుండియు స్వాతంత్ర్యముకొఱకే హోరాహోరిగఁ బోరుచు, నేఁటివఱకును జయ మొందుచునే యుండెను. కాని యీ విజయసాధనకై యెందఱో వీరులు తమరక్తమును ధారపోసిరి. వారసంపూర్ణముగ విడిచిన కార్యమును మనము పూర్తిచేయవలదా? మేవాడు పడిపోయినఁ గేవలము రాజపుత్రస్థానమే కాదు, యావద్భారతదేశమును మొగలుల పాదాక్రాంతముకాఁగలదు.

భారతజనని తన యనుంగుబిడ్డలమైన మనవంక దీనయై చూచు చున్నది. ఈ దేశమందలి జల వాయు ప్రభావముచే, నామె సస్యశాకఫలక్షీరములచే మన మింతవఱకుఁ బెరిఁగి పెద్దవార మైతిమి. అట్లు పోషింపఁబడిన యీ శరీరమును దిరిగి యామె సేవలో నర్పించుటకన్న నామె ఋణమును దీర్చుకొనుటకు వేఱొండుమార్గ మేమికలదు? 'జాతస్యహి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్యచ' అను గీతావచనంబును స్మరింపుఁడు. ఎప్పటికైన నెవరికైన మృత్యువుతప్పదు. జరావ్యాధులచేజీర్ణించి, మంచముపఁబడి తుదకుఁ జచ్చుటకంటె, సంపూర్ణముగ వికసించిన యీ జీవనకుసుమంబును మాతృదేవి చరణకమలంబున నర్పించిన మనజన్మము సార్థకము కాఁగలదు. ఎప్పటికైన మరలఁ గర్మభూమియుఁ బుణ్యభూమియు నగు నీ భారతవర్షముననే జన్మించి, యీ తల్లిఋణమును దీర్చుకొనుట మనవిధి కాదా?

సోదరులారా! యీ మొగలులు మనకుఁ గావించిన యెగ్గులు మఱచితిరా! మన పతివ్రతాశిరోమణు లెందఱో తమ భర్తలు యుద్ధమున గెల్చు నవకాశంబు లేదని గ్రహించి నపుడు ప్రాణముకంటె మానమే గొప్పది యని త్రికరణశుద్ధిగా నమ్మి, చితిఁ బేర్చి, తమ జీవితముల నగ్నికి నాహుతిచేయలేదా? జాజ్వల్యమానములగు నాచితులచే సంక్షుబ్ధమైన భారతమాత హృదయసీమ యిప్పటికిని జల్లారకున్నది. అవమానకరమగు జీవయాపనమును జెల్లించుటకన్న మరణమే మేలని యెంచి, తమ శిరంబుల నిచ్చిన వీరులీనాఁడు సమాధులలో నుండి కారుణ్యపూర్ణస్వరములతో 'మమ్ము మఱువకుఁ'డని మనతో మొఱవెట్టుచున్నారు. ఒక్క స్త్రీ యవమానముఁ బాప మహా భారత సంగ్రామంబు జరిగెను. ఈనాఁ డెందఱో స్త్రీలవమా

నిందింపఁబడుచుండ నూరక చూచుచుండఁదగునా? పౌరులారా! కావున యుద్ధమునకు సంసిద్ధులు కండు."

హృదయమర్మములను స్పృశించు నీ ప్రబోధవాక్యములు విసరఁబడిన శిలాఖండం బందలి జలమును గలఁచిన చందంబున సభ్యుల హృదయంబుల గలఁచివైచెను. కొందఱు కన్నీళ్లు కార్చిరి. కొందఱు 'యుద్ధము చేయవలసినదే' యని యుద్రేకముతోఁ గేకలు వేసిరి. కొందఱు, "ఈమె యెంత చక్కఁగాఁ బ్రసంగించినది!" అని యామెను మెచ్చుకొనుచు నూరక యింటికి వెడలిపోవ సిద్ధపడుచుండిరి. ఇంతలో నొక బాలుఁడు లేచి "అమ్మా! నీవు చెప్పినదంతయు సత్యమే కాని క్రీడాసక్తులమగు బాలురము మేమేమి చేయఁగలము? విద్యాభ్యాసములో నగము కాలము గడచుచున్నది. దేశసేవకు సమయమెక్కడ?" యని నిష్కపటహృదయముతో నడిగెను. తరువాత నొకఁడు నిలువఁబడి, "తల్లీ! సంసారబంధములలోఁ జిక్కి, కుటుంబపోషణకై ధనమార్జించుచు జీవితముఁ గడపుచున్న మేము యుద్ధమునకుఁ జనిన మా యాలుబిడ్డల గతియేమి?" అని నిరాశతోఁ బ్రశ్నించెను. అంత నొక వృద్ధుఁ డతిప్రయాసతోఁ గఱ్ఱ నాధారముగఁ జేసికొని రొప్పుచు, "దేవీ! నీయమృత వాక్యములు నా హృదయమున నాటుకొనినవి. నా జీవితమును వ్యర్థముగాఁ గడపినందు కెంతయో చింతించుచుంటిని. ఇప్పుడు జరావ్యాధులకుఁ జిక్కి, మృత్యుముఖమున నుండి, జవసత్త్వము లుడిగిపోయి, చింతాసక్తుఁడనగు నావలనఁ గాఁదగినది యేమి?" అని నిట్టూర్పు విడుచుచు గద్గదస్వరముతోఁ బలికెను. సర్వసంగపరిత్యాగియై బ్రహ్మధ్యానంబుఁ జేయుచు నేకాంతంబునఁ గాలంబుఁ గడుపుచున్న ముముక్షువొకఁడు జననీ! ప్రాపంచిక

విషయములకు దూరుండనై నిర్జనప్రదేశంబుల కేగి మోక్షమార్గము నన్వేషించు నాకు నీ యుద్ధపు గొడవ యేల? నేనా జ్ఞానమార్గమును వదలి కర్మమార్గమునఁ బ్రవేశింపఁ బనియేమి" యని విరక్తుండై నుడివెను.

పైనఁ జెప్పిన వివిధములైన యభ్యంతరముల నన్నిటిని నావధానముగ నాలకించుచున్న యా సాధ్వీమణి, 'భారతీయులారా! మీరు చూపిన కారణములును, గష్టములును యథార్థములైనవే. కాని యెవరిమట్టుకు వారు తప్పించుకొనిన దేశమును రక్షించువార లెవరు? ఇయ్యవసరంబున రాణాప్రతాపునంటి వీరవరు లుండిన నెంత బాగుండునని మన మెల్లఱ మనుకొనుచుందుము. కాని ప్రతాపు లాకాశమునుండి యూడిపడుదురా? వారు మనలోనుండియే రావలెను. 'దేశరక్షణకుఁ బ్రతాపుఁడు కావలెను. కాని యతఁడు ప్రత్యేకముగా మన కుటుంబమునకు నుపయోగపడఁడు కనుక మన కుటుంబములో జన్మించరాదు. అట్టివాఁ డున్నందునవలనఁ గలుగు నష్టకష్టములను మఱియొక కుటుంబ మనుభవించవలెను. దానివలన దేశమునకుఁ గల్గు సుఖలాభములను మనము పొందవలెను.' అను మనోవృత్తి దేశమునకు క్షేమకరమా? దేశసేవకుపయోగపడని వారెవరు? స్త్రీలుసైతము నావలె నందఱును సన్యాసినులు కాకపోయినను సత్సంతానముఁ బడసి, వారి బిడ్డలకు భారతవీరుల కథలను వినిపించి, బాల్యమునుండియు సత్యపరాక్రమముల నలవరిచి, మహావీరులనుగా సిద్ధము చేయవచ్చును. భర్తలను బ్రోత్సహించి దేశసేవ కుద్యుక్తులనుగ నొనర్పనగును. చేతనైన, రాణీ దుర్గావతివలెఁ గొందఱు ఖడ్గముల ధరించి పురుషులకు సిగ్గువచ్చునట్లు యుద్ధముఁ జేసినఁ జేయవచ్చును. బాలురే భావి

పౌరులు. భారతభాగ్య విధాతలు. బాల్యముననే దేశభక్తి బీజములు వారి నిర్మల హృదయములందు నాటుకొనిన వారు యుక్తవయస్కులైన పిమ్మట నవి ఫలించఁగలవు. దేవతా పూజకు వాడిపోయిన పూలుకాని, రెక్కలురాలిన పూలుకాని, పురుగులుతినిన పూలుకాని పనికిరావు. అట్లే గుణహీనులగు కపట దేశభక్తులును దేశమున కుపకరించరు. ముఖ్యముగా వ్యక్తిశీలమును, రాష్ట్రశీలమును గల తరుణవయస్కులే వాస్తవమైన దేశసేవఁ జేయఁగలరు. వృద్ధులు తమ యనుభవముచేఁ దరుణుల సరియైన మార్గమున నడిపి, వారి కుత్తేజమును గలిగించుచు, నంతిమశ్వాసవఱకుఁ దమ శక్తికొలఁది దేశమున కుపయోగపడు కార్యములఁ జేయుచు నుత్తరజన్మలోఁగూడ నీ పవిత్రభారతావనియందే జనించి, మాతృఋణముఁ దీర్చుకొనవలెననెడి తుదికోరికతో నీతనువును వీడవలెను. కవులు దేశభక్తి పూరితములైన పద్యములను, గీతములను రచించి తమ కవితాశక్తిని దేశసేవకై వినియోగించఁ జనును. చిత్రకారులు పానిపట్టుయుద్ధమునో, స్థానేశ్వర సంగ్రామమునో, హల్దీఘాట్ సమరమునో చిత్రించరాదా? వారు బందిగంబున నుండిన భారతమాతయొక్క బంధనములను భారతవీరులు ఖండించుచున్నట్లు చూపిన నెంత బాగుగనుండును? సుందరాంగులను చిత్రించుటకు బదులు, గాజులు తొడిగిన కరకమలంబుల మరలఁ గృపాణంబులను జూపియో, లేక రక్తవస్త్రులై 'జోహారు' చేసెడి క్షత్రియనారులను జిత్రించియో, ప్రేక్షకులలో వీరత్వమును గల్పించి తమ చిత్రకళను సార్థకము చేసికొనలేరా ?

ఇఁక దేశమంతయు నల్లకల్లోలమైయుండ జపతపంబులకు వలయు ప్రశాంతమగు స్థాన మెచట నుండును ? ఒకవేళ నది

లక్ష్యమైనను, స్త్రీలు, శిశువులు, గోవులు, దేవాలయములు, ధర్మగ్రంథములు మున్నగువానికి రక్షణలేక, ధర్మమునకు గ్లాని సంభవింపనున్నప్పు డేకాంతమున వ్యక్తి మోక్షమునకై సాధన చేయు ముముక్షువునకు మనశ్శాంతి యెక్కడిది? మోక్ష మెక్కడిది? ఇది కేవలము భ్రమ కాదా? 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యను వాక్య మేమయ్యె? ఆ వాక్యమును పాటించితిమే కదా పూర్వము ఋషులు ధర్మమునకు గ్లాని సంభవించునపుడు తాత్కాలికముగఁ దమ జపతపంబులఁ గట్టి పెట్టి, వీరపురుషులచే ధర్మరక్షణ గావించి, పిమ్మటఁ దమ జప తపంబుల యథాపూర్వముగ సాగించుకొనుచుండెడివారు," అని నా ప్రచారిణి పలికినంత నా సభికుల మనంబుల నపూర్వ సంచలనంబు కల్గుటం జేసి. వారెల్లరు నాబాలగోపాలము యుద్ధకార్యమునకుఁ నడుముగట్టి, భూనభోంతరాళములు బ్రద్ద లగునట్లు 'భారతమాతా కీ జై' యను నినాదంబులఁ జేయుచు నచటినుండి బయల్వెడలిరి.

## విశ్వప్రేమ

రాత్రి గతించె. తూర్పు తెల్లవారె. లోకబాంధవుఁడు తన కరంబులచే సమస్త ప్రాణికోటులను మేలుకొలుపుచుండె. ఉదయపురమందలి రాజప్రాసాద సమీపమున నున్న యుదయ సాగరంబునఁ గమలంబు లుదయభానుని ప్రేమపూర్ణమగు కర స్పర్శచే మెల్ల మెల్లగ మేల్కొనసాగెను. మందమారుతా నిలంబులు సృష్టికి నూతన చైతన్యము నిచ్చుచుండెను. అట్టి పవిత్రసమయమున నొక తెల్లచలువరాతి తిన్నెపైఁ గూర్చుండి

బ్రహ్మరాణి యగు వాణింబోలెఁ దన కోమలపాణితో వీణను గ్రహించి వాయించుచు నొక జగన్మోహనాంగి ప్రేమగీతమును బాడుతఱి, నొక భిక్షుకసమూహ మచట వేచియుండెను. వా రందఱును భిక్షను గ్రహించి వెడలిన పిదప నచటి కొక ముసలి బిచ్చగాఁడు తాను బుట్టుగ్రుడ్డియగుటచేఁ దన బిడ్డఁడు దారిచూపుచుండ, నామె యెదుటకువచ్చి, "అమ్మా! దిక్కు-లేనివాఁడను. పురాకృతకర్మవశమున నిట్లు తిరుగాడవలసె. ఈ దీనునిపై దయఁదలఁచి బిచ్చము పెట్టు" మని వేఁడెను. అంత నామె తన నవనీత కోమలహృదయము ద్రవింప, నాతని కొక బంగారునాణెము నిచ్చెను. అందుల కా వృద్ధుఁడు మిగుల సంతసించి, "యీశ్వరానుగ్రహమున నీవు శీఘ్రముగ రాణి వగుదువు గాక" యని దీవించె.

అయ్యవసరంబున నొక క్షత్రియవీరుఁడు శిరోవేష్టనంబును దాల్చి, నడుమున ఖడ్గమును, డాలును బంధించి, ముఖంబున క్షాత్రతేజం బుట్టిపడ నా వాకిటికిఁబోవుచు నామెను గాంచి, "రాజకుమారీ? యిచట నొంటిగ నేమిచేయుచుంటి"వని యడిగెను. అందుల కామె, "అజయా! ప్రకృతిసౌందర్యమును గాంచి యానందించుచుఁ బ్రేమసుధాపూరంబున నోలలాడుచుంటిని. దీనులకు ననాథులకు నన్నవస్త్రాదుల నిచ్చి వారిని సంతోషపెట్టుటవలనఁ గలుగునానందము మఱియొకవిధమునఁ గల్గునా? వారి సుఖమే మనకు సుఖముకాదా? ప్రేమవంటి వస్తువుకలదా? అజయా! నీ వెచటికేగుచుంటివి!" అని పలికెను. అంత నాతఁడు, "మానవతీ! నేను యుద్ధమునకుఁ బోవుచు నీ సెలవు గైకొనుటకై వచ్చితిని. తిరిగి వచ్చెదనో రానో చెప్పఁజాలను. యుద్ధమున మరణించుటయును సంభవమే! అప్పుడు నీకించుకైన

విచారము కల్గునా?" అని యడిగెను. అంతు కామె చూపిన యౌదాసీన్యమునకు నిరుత్సాహపడి, "నేను నిన్నెంతగాఁ బ్రేమించుచుంటినో యెఱుఁగుదువా? నీవును నన్నెంతగాఁ బ్రేమించుచుంటివా? ఇఁక మఱెవ్వరిపైన నేని నీకంతగాఁ బ్రేమ కలదా?" యని ప్రశ్నించిన, నామె "అజయా! నీవు నన్నెంతగఁ బ్రేమించుచుంటివో, నేనును నిన్నంతగఁ బ్రేమించుచుంటిని. కాని నిన్నుఁ దప్ప మఱెవ్వరిని బ్రేమింపరా దనుకొనుట న్యాయమా? నా హృదయమును గేవలము నీ ప్రేమపాశముల తోనే బంధింపఁదలఁచితివా? అది స్వార్థముకాదా? నాకు నీయందే కాదు. పరమేశ్వరునిచే సృజింపఁబడిన సకల భూతము లందును సమానముగ ప్రేమ కలదు. ఇది నేరమా?" అని యామె పవిత్రభావముల నెలిబుచ్చెను. తొలుత నామె పలుకు లాతని హృదయంబున ములుకులవలె గ్రుచ్చుకొనినను, వివేక వంతుఁడగు నాతఁడు కొంతతడ వాలోచించి, "మానవతీ! అవివేకినై పవిత్రమును, విశాలమును నగు నీ హృదయంబును నా యందలి వ్యక్తిప్రేమచేఁ బరిమితము చేయఁ బ్రయత్నించి నందుకు క్షమించుము. నాకిఁక సెలవొసంగు"మని పోఁబోవు చుండ, నామె కరుణాకలితవదనారవిందయై "అజయా! నీకు విజయంబగుఁ గాక" యని తన సౌహార్దముఁ బ్రకటించెను.

అజయుఁడు వెడలిన యనంతరము మా మానినీమణి యేకాంత మునఁ "బ్రపంచమున జాతి మత్సరంబును, మత ద్వేషంబును హెచ్చు పెరిఁగిన కొలఁది యుద్ధము లనివార్యము లగుచున్నవి. కాని యుద్ధ మెంత ప్రాణిహింసకుఁ గారణమగును? ఎందఱు స్త్రీ లనాథ లయ్యెదరు! ఎందఱు మాతాపిత లపుత్రకు లగుదురు? ఎందఱు వికలాంగులయ్యెదరు? ఇంకెందఱు గాయపడి మరణ

వేదనకన్న నెక్కుడుబాధ ననుభవింతురు! ఇది యంతయుఁ దలఁచుకొన్నంత మాత్రముననే నా హృదయము తల్లడిల్లుచున్నది" అని తలపోయసాగెను.

ఇంతలో రాణి ప్రవేశించి, "కుమారీ! వింటివా? మీతండ్రిగారీ సారి పాదుషాసేనలతోఁ బోర నిశ్చయించిరి. దీని ఫలితము సర్వనాశనమే. యుద్ధమునఁ బాల్గొనువారు మరణించుట యటుండ సహాయకులగు మిగిలినజనులును నశింతురు. దీనికిఁ దోడు నీ వివాహ ప్రయత్నము ఫలోన్ముఖమగు సమయమున నీ యవాంతరము వచ్చిపడినది. ఇఁక నీ వివాహ మెల్లు జరుగునా యని చింతిలుచున్నాను." అని పలికిన నారాజకుమారి, "అమ్మా! నాకుఁ బెండిలికాకున్న నష్టమేమి?" అని యడిగెను. అందుకా రాణి, "బిడ్డా! అట్లనకుము. గృహస్థాశ్రమము పంగ్వంధబధిరులకును, వానప్రస్థులకును, క్షపణక, కాపాలికాదుల కెందఱకో యాశ్రయమిచ్చును. గృహిణియే యతిథుల పాలిటి కల్పవృక్షము. అందులో యోధపుర రాజకుమారునకు నిన్నిచ్చి వివాహముచేసి యీ సంసారాబ్ధిని దరింపవలెనని యెంతయో యాశపడితిని. ముందు నీ వివాహముచేసి పిమ్మట యుద్ధము తలపెట్టుఁడని యెంత చెప్పినను మీ తండ్రిగారు వినరైరి. ఏమిచేయుదును?" అని యెంతయు వగనొందుచున్న జననిఁగాంచి, యా మానవతి, "తల్లీ! వివాహముఁ జేసికొని సంసారసుఖముల ననుభవించువాని జన్మముకన్న, యుద్ధమందు క్షతగాత్రులైనవారికి సేవఁజేయుటవలనఁగల్గునిరతిశయానందము జూరఁగొనువాని జన్మ మెంత ధన్యమైనది! అజయుఁడు శత్రువుల సంహరించుచుండ, నేను వారిని రక్షించుచుందును. అమ్మా! చింతింపకుము. అజయుని సేనవెంట నేనును బోదును.

ఇది నామనోనిశ్చయ"మని పలికెను. అంతట రాణి చేయునది లేక రాకుమారి వైరాగ్యభావమునకును, నామె వివాహవిషయములో రాణాకుఁగల యుదాసీనతకును జింతాగ్రస్త మానసయై యచటినుండి సౌధాభ్యంతరమునకు వెడలిపోయెను. మానవతియుఁ దాను జేయనున్న మహత్కార్యమునకు నెంతయు నుత్సాహపడుచు, నమందానందకందళిత హృదయారవిందయై సేవాదళంబును నాయత్తపఱుప రాజాజ్ఞను బడయఁ గోరి లోనికిం జనియెను.

## మొగలుల యుద్ధసన్నాహము

మహారాణా ప్రతాపుఁడు మేవాడు స్వాతంత్ర్యమునకై యావజ్జీవము ధారపోసిన ధన్యజీవి. కాని యతని పెద్దన్నయగు సగరసింహుఁడన్నవో దేశాభిమానశూన్యుఁడై యతి దీనావస్థలోనున్న మాతృభూమిని వదలి, దేశ శత్రువులగు మొగలులకు దాసుఁడయిన 'దేశద్రోహి. అతని పుత్రుఁడు మహీపతిసింహుఁడు తండ్రివలె మొగలుల పక్ష మవలంబించుటయ కాక మహమ్మదీయ మతమునుగూడ స్వీకరించి, మహబత్ ఖా నను నామమును గ్రహించెను. కాలక్రమమునఁ దన సహజ శౌర్య పరాక్రమములచే జహంగీరుపాదుషాకు సేనాధిపతియయ్యెను.

అతఁ డొకనాఁ డాగ్రాలోఁ దన గృహంబున మొగలు సర్దారుఁడగు నబ్దుల్లాతో, "ఏమీ! తుపాకిధ్వనివిన్నంతనే గుండె పగిలి క్రిందఁబడు హిందూయతు ఖానుఁడు మనకు సర్వసేనాధిపతి యయ్యెనా? ఎంత యాశ్చర్యము! అతనివెంటఁ బాదుషా నాల్గు వేల సైన్యమునుగూడఁ బంపెనట! ఈ వార్తను విూ రిదివఱకే

వింటిరా!" అని యడిగెను. అంత నా సర్దారుఁడు, "చిత్తము. అతని యోగ్యతను బట్టి కాదు. పాదుషాకు మేనల్లుఁడగుట వలన నీపదవి యతనికి లభించె" నని బదులుచెప్పెను.

మహాబతు :- హిదాయత్ ఖాను పేరుకు మాత్రమేకాని సర్వసేనాధిపతి వాస్తవముగా వినాయత్ ఖా నఁట. ఇనాయత్ ఖాను యథార్థముగ మంచి యోధుఁడే. కాని హిదాయత్ వంటి శూద్రులింక నెందఱు గొప్ప పదవులలోనికి గానున్నారో యెవరు చెప్పఁగలరు? యోగ్యతకు స్థానమెక్కడిది? ఆశ్రయించిన బంధువులకు, మిత్రులకే కదా యున్నతపదవులు లభించుట !

అబ్దుల్లా :- పాదుషా యీసారి తమకు మేవాడుపై యుద్ధము చేయ నాజ్ఞ యిచ్చెనా? అట్లయైన తా మీ యుద్ధములో నేల పాల్గొనుట లేదు ?

మహా :- పాదుషా నన్ను దక్కను, గుజరాతు, బంగాళము లలో నెచటికేఁ బొమ్మనినను నందుకు సిద్ధముగ నున్నాను. కాని మేవాడుపై యుద్ధమునకుఁ బోవుట నాకు సమంజసము కాదు. అది నాజన్మభూమి.

అ :- అట్లయెనఁ దాము సెలవిచ్చినది న్యాయ్యమే. నాకు తడవగు చున్నది. పోయివచ్చెదను. సెలవిండు.

అని పలుకుచు నతఁడు వెడలిపోయెను. అంత మహాబత్ ఖాను "హిదాయత్ నాయకత్వమున యుద్ధ మెంత హాస్యాస్పదముగ నడచునో చూడవలసి యున్నది"యని యనుకొనెను.

# ఉత్తరకుమార ప్రజ్ఞలు

మొగలు శిబిరమున సర్వసేనాధిపతి హిదాయతు అలీఖాను తన సర్దారుఁడగు హుసేనుతో నిట్లు సంభాషించుచుండెను.

హిదాయత్ :- హుసేన్ ! యీ కాఫిరులను గెల్చుట మన వంటి శూరుల కొకలెక్కా ?

హుసేన్ :- అయ్యా! అది యంత సులభముకాదు. ఈ చిన్న మేవాడురాజ్య మాఱువందల సంవత్సరములనుండి మొగల్ సామ్రాజ్యమునకు లొంగక తలయెత్తుకొనియే యున్నది. అక్బరు వంటి పాదుషాకూడ దీనిని జయించలేకపోయెను.

హి :- అక్బరునకు నావంటి సేనాధిపతియున్న తప్పక గెల్చెడి వాఁడే.

హు :- అయిన మానసింహుఁడు సామాన్యుఁడా ?

హి :- అతఁడు యుద్ధము చేయఁగలఁడా ? నే నీ రాజపుత్రులఁ జీల్చి చెండాడెదను. హుసేన్ ! నీవును యుద్ధము చేయుట నేర్చుకొనుము. అది యెప్పటికైన నుపయోగపడును.

హు :- మహావీరులమనుకొను తమవంటి వారికి గతిలేదు కాని, నా విషయమై చెప్పనలెనా ?

హి :- ఓయీ ! నీవు భయభక్తులవిడిచి మాటలాడుచున్నావు. నేను సర్వసేనానినని యెఱుంగుదువా ! 'ఖబర్దార్' ! నేను దలఁచుకొనిన నీ ప్రాణములు నీవికావు !

హు :- చిత్తము. మహాప్రభూ ! తమశక్తి నే నెఱుంగనిది కాదు. కాని మేవాడును జయించుట—

హి :- ఆ మాటయే యెత్తవద్దనుచున్నాను. నా ప్రియమిత్రుఁడవు కానఁ జెప్పుచున్నాను. మేవాడును జయించుట నాకొక లెక్కకాదు. చూచెదవు కదా నా పరాక్రమము.

హు :- అందుకు సందేహమా! పోయి వచ్చెదను. సెలవిండు అని వెడలిపోయె.

హిందాయతును, "ఈ కాఫిరులను జయించుట కష్టమా! వీరితో యుద్ధము చేయ నావశ్యకతయే కలుఁగదు. ఫిరంగులధ్వని విన్నంతనే యందఱును బాఱిపోరా? యుద్ధరంగమున నొక్కఁడైనఁ గనుపించునా?" అని తలఁచుచు రొమ్ము విఱుచుకొనుచుఁ బోయెను.

## గురుపూజ

ప్రపంచములోని జాతులన్నియు భోగమునే జీవితమునకుఁ బరమలక్ష్యముగా నిడుకొని, స్వల్పకష్టముతో నధికసుఖమును సమకూర్చు సాధనములకై వెదకుచుండ, భారతీయజాతి యొక్కటియే త్యాగమును జీవితమునకుఁ బ్రధానాదర్శముగా గ్రహించియుండెను. సర్వసంగపరిత్యాగులైన యతులు ధరించు కాషాయాంబరమే యీజాతికి సాంస్కృతికచిహ్నమై దేవాలయములపైనను, మఠములమీఁదను, వర్తకపుటోడలపైనను, యుద్ధభూములందు సైతము విరాజిల్లుచుండెను. వేదకాలమందును, బురాణకాలమందును, జరిత్రకాలమందును నిది రాష్ట్రధ్వజముగ నుపయోగింపఁబడుచుండె. ఇంతయేల, సృష్టిప్రారంభమునఁ గాంతిదాతయుఁ బ్రాణదాతయు నగు సూర్యభగవానుఁ డుదయించునపుడాయన రథముపై వెలసిన దీయరుణధ్వజమే! భారతజాతికి నిది గురుస్థానమున నున్నది. కావున

నీ దేశమునఁ జాలప్రాంతములందు వ్యాసపూజ యను పేరుతో నీ ధ్వజమునుఁ బూజింతురు.

పై సాంప్రదాయము ననుసరించి యాషాఢ పూర్ణిమనాఁడుదయపురరాజప్రాసాదంబున కెదురుగనున్న విశాలమగు మైదానములో గురుపూజకై సైనికులును, బౌరులును బారులు తీరి సిద్ధముగ నిలిచియుండిరి. పరివారసమేతుఁడై రాణా యా సభాస్థలిని బ్రవేశించినంతనే యందఱును నిశ్చలులై యుండిరి. ఆయనకు సైనికవందన మర్పింపఁబడెను. ప్రత్యేకముగా నమర్పఁబడిన వేదికను సమీపించి, రాణా పుష్పహారములతో నలంకరింపఁబడిన యీ ధ్వజంబు నెగురవేసెను. అది మెల్ల మెల్లగఁ బైకి పోవునపుడు రాజపుత్రుల హృదయంబులందుఁ బ్రజ్వలించు నగ్నిశిఖవలెను, శత్రువులపాలిటి మృత్యుదేవతా జిహ్వవలెను భాసిలుచుండెను. రాణా దానిని గుంకుమ, పుష్పాక్షలతోఁ బూజించి, ప్రణామంబుఁ గావించెను. అనంతరము ముఖ్యాధికారు లొకరివెంట నొకరిట్లే ధ్వజంబుఁబూజించి, ప్రణామంబుఁ జేసిరి. దేశభక్తినిఁ బురికొల్పుచుఁ గొందఱు మాన్యపురుషులుపన్యసించిరి. ధ్వజావతరణానంతరము, రాణా వెడలిపోవునపుడు మరల నందఱును నిశ్చలులై నిలువఁబడిరి. అనంతరము సైనికులు 'హర హర' నినాదములతో యుద్ధభూమి కరిగిరి. క్రమపద్ధతిలోఁ బురజనులును వెడలిపోయిరి.

## దేవారుయుద్ధము

రాజపుత్రసైనికు లేఁబదివేలమందియే యైనను మేవాడు స్వాతంత్ర్యమును రక్షించుకొనవలెననెడి దీక్షతో నతిభీషణ

రణంబు సాగించుచుండిరి. ముగల్ సైనికు లన్ననో ధనాపేక్షచే సైన్యమునఁ జేరిన వివిధజాతుల వారగుటచే వారి ముందు నిలువలేకపోయిరి. సింహములవలె గర్జించుచు లంఘించుచున్న యా పురుషసింహములు వైరులర క్తముతోఁదమయసువుల పిపాసనుదీర్చుకొనుచుండిరి. దూరమున నొక శిబిరములోనున్న హిదాయతు అలీఖానునకు రాజపుత్రుల శీకరహుంకారములే విన వచ్చుచుండెను. ఆకోలాహలములో ముగలుల కంఠధ్వనులే వినిపించుటలేదు. యుద్ధగతి యాతఁడనుకొనిన ట్లుండక, పూర్తిగ విరుద్ధముగఁ గనుపించుచుండెను. ఆతని శిబిరమును నిద్దఱు సిపాయీలు ఖడ్గహస్తులై రక్షించుచుండినను, వెలుపలికి వచ్చి యేమి జరుగుచున్నదో చూచుట కాతనికి ధైర్యము చాలకుండెను. కాని తన భీరుత్వమును బైట పెట్టక హుసేనుతో, "సర్వసేనాధిపతి నగు నేను బైటికి రావలసిన పనియేమి? ఈ రాజపుత్రుల పసపట్టులకు నా బావమఱఁది యినాయత్ ఖాను చాలఁడా? నాంకో పీరేమి యుద్ధము చేయఁగలరు?" అని ప్రగల్భము లాడుచుండె.

ఇంతలో యుద్ధ కోలాహలము సమీపమున వినవచ్చుచుండెను. చీఁకటి పడిన కొలఁది హిదాయతు ఖాను హుసేనును విడిచి యొంటిగ నుండలేకపోయెను. ఇట్టితఱి ముగలు సేనాపి యగు షెమ్‌షేర్ ఖాను మరణవార్త పిడుగువలె నాతని చెవినిఁ బడెను. కాని ఇనాయతుఖా నింకను సజీవుఁడై యుండి తక్కిన సేనానులతోఁ బాటు యుద్ధము చేయుచుండె నని విన్నపిమ్మట నాతనికిఁ గొంత ధైర్యము చిక్కెను.

అంతట హామ్‌సేను, "మహాశయా! మేవాడును జయించుట చాల సులభమని తాము సెలవిచ్చితిరి. అది యెంత కష్టమో తమ కిప్పటికైనఁ దెలియవచ్చినదా?" అని యెత్తిపొడిచెను. ఇంతలో శత్రుసేన లింకను సమీపమునకు వచ్చుచున్నట్లును, ముగల్ సేనలు రాజపుత్రుల ధాటికిఁ దాళఁ జాలక పాఱిపోవు చున్నట్లును వార్తవచ్చెను. హిదాయతు వదనము కాంతి హీనమయ్యెను. దీనికిఁదోడు ఇనాయతు ఖాను మరణించిట్లు విన్నంతనే యతఁడు మూర్ఛిలి, కొంతవడికిఁ దెప్పిరిలి, "ఏమీ! ఇనాయతు కూడ మరణించెనా? ఇంక ముందుగతి యేమి? అదిగో! శత్రువుల కోలాహల మంత కంతకు వృద్ధియగుచు నింకను సమీపమునకు వచ్చుచున్నదే!" అని కలవరపడు చుండ, సర్వమును ధ్వంసమైనందున ముగలుసేన లన్నియుఁ బలాయనమగు చున్నట్లును, రాజపుత్ర సైన్యములు విజృంభించుచు వారినిఁ దఱుము చున్నట్లును వార్తవచ్చెను.

ఇంతలోఁ "పాఱిపోవుఁడు, పాఱిపోవుఁడు" అను కేకలు వినిపించెను. హామ్‌సేనొకవైపు పాఱిపోవ, హిదాయతు భయభ్రాంతుఁడై మఱియొకవైపు పాఱిపోయి, తుపాకి గుండుదెబ్బ తిని క్రిందఁబడెను. ఇంతలో ముగలులపతాకమును స్వాధీనము చేసికొనిన యజయసింహుఁడ నేకులగు రాజపుత్రులతోఁగూడి విజయఘోషను గావించుచుఁ బ్రవేశించెను. అంత హిదాయతుఖా నతిదీనుఁడై యాతనిశరణుఁజొచ్చెను. ముగలుల సర్వసేనానియయ్యు నితఁడు రణరంగమునఁ గనుపించక, యిప్పటికిని తన శిబిరములోనే పడియున్నందు కచ్చెరువొంది, యజయుఁడు "ఇంత ధైర్యశాలివి, మేవాడును జయించవచ్చితివా!" యని

పరిహాసించి, యాతనిఁ బ్రాణములతో విడిచిపెట్టెను. పిమ్మట హిదాయతు "బ్రతుకు జీవుఁడా" యని కొనయూపిరితో నచటనే పడియుండెను.

సమరభూమి యంతయు గుట్టలు గుట్టలుగాఁ బడియున్న మృతకళేబరములతో నిండియుండెను. ఎచ్చటఁ జూచినను క్షతగాత్రుల యాక్రందనములే వినవచ్చుచుండెను. ఆ భయానక దృశ్యముల నడుమ, నా యర్ధనిశీథినీసమయమునఁ గాగడాలను జేతఁబట్టుకొనిన కొందఱు సైనికులు వెంటరా, దివ్యజ్యోతి వలె వెలుఁగొందుచున్న మానవతి మానవసేవఁ జేయుచు, హృదయవిదారకమైన యామానవహత్యకును, నార్తనాదములకును జాలిపడుచు, "దైవమా! యీలోకమున నింత ప్రాణిహింస జరుగుచుండ నీ వూరక చూచుచుంటివా? ఇది నీకు విలాసమా? దయామయుఁడవగు నీ వీ వధను మాన్పలేవా?" యని లోలోన విచారించుచుండెను.

గాయపడినవారికిఁ బలు తెఱంగుల నుపచారముచేయుచుఁ దిరుగుచున్న యా రాజకుమారికి దాహమువలన బాధపడుచున్న హిదాయతు కనుపించెను. ఆతనిస్థితి కామె జాలిపడి, దాహముఁ దీర్చి ప్రాణముల నిలిపెను.

అంతట సైనికపరివృతుండై యజయసింహుఁ డచటికివచ్చి యా యంధకారములో నామెను గుర్తించి, యామె చేయుచున్న పనికి మిగులసంతసించి, తనసైనికులఁ గొందఱి నాపనిలో నామెకు సాయముచేయ నియమించెను. వా రాపనిమీఁద నచటినుండి వెడలిపోవ, నొంటిగనున్న రాజకుమారినిఁ గాంచి, "యా భీషణరణరంగమున మృత్యుదేవత తాండవమాడుచున్న

యా యర్ధరాత్రి సమయమున, గాఢజీమూతముల నడుమ మెఱయు విద్యుల్లతవలె వెలుంగుచున్న యాలతాంగి కరుణామూర్తికి మురియుచుం జేయిపట్టుకొన నామె సిగ్గుతోం దల వంచుకొనెను.

## విజయోత్సవము

మేవాడు రాజ్యమంతయుం బచ్చని తోరణములతోను, నెఱ్ఱని పతాకములతోను గళ గళ లాడు చుండెను. ఉదయ పురమందలి రాజమార్గములన్నియు నతిమనోహరముగ నలంక రించిరి. వీధులప్రక్కనం బురజనులు బారులుతీరి నిల్చియుండిరి. చారిణు లనేకులు గానముం జేయుచు వచ్చుచుండిరి. ఇంతలో జయభేరి మ్రోగెను. మంగళవాద్యంబులు వినవచ్చెను.

వృత్రాసురసంహారానంతర మమరావతిం బ్రవేశించు నమరపతి మాడ్కి నా యమరనృపవరుం డుదయపురంబుం బ్రవే శించు నపుడు పురస్త్రీలు సౌధాగ్రముల నుండి యాతనిపైం బుష్పవృష్టిం గురిపించిరి. కొందఱు స్త్రీ లెదురుగవచ్చి హారతు లిచ్చి, ముఖమునం గుంకుమ బొట్టు పెట్టిరి. మఱి కొంద ఱాతని కంఠమును బుష్పహారములతో నలంకరించిరి.

గోవిందసింహుండును, నజయసింహుండును, నితరసామంతు లును వెంటరా నా రాణా రాజభవనంబు సమీపించగనే, 'మేవాడ్ కీ జయ్, రాణా అమర సింహా కీ జయ్' అను విజయధ్వను లాకసము నంటెను.

రాణా నిజభవనంబుఁ బ్రవేశించినంతనే పురజనులు తమ తమ యిండ్లకుఁ జనిరి. యవనుల గర్వమడంచి, సూర్యవంశజులగు రాణాల ఖ్యాతిని నిల్పిన మేవాడు వీరుల చరిత్రలో నిది యొక ప్రధానఘట్టము.

## భేదతంత్రము

సగరసింహుని పుత్రిక సుభాషిణి. ఆమె భర్త గజసింహ మహారాజుతో గుజరాతుపై యుద్ధము చేయుటకుఁ బోయి, యచటనే మరణించెను. పతిహీనయగు నామె యొకనాఁడుదయమున "మేవాడ్, మేవాడ్" అని కేకలు వేయుచు, నామె ముద్దుబిడ్డఁడగు నరుణసింహుని విడువలేక విడువలేక, విడిచి పెట్టి యెచటికో పోయెను. ఎంత వెదకినను నామె కానరాదయ్యె. పిమ్మట నామె జాడ తండ్రికిఁగాని, మఱెవ్వరికిఁ గాని తెలియలేదు.

దేవారు యుద్ధానంతర మొకనాఁడు సగరసింహుఁ డమరసింహుని యద్భుతవిజయమునుగూర్చి యాగ్రాలో స్వగృహంబునఁ దన మనుమనితోఁ బ్రసంగించుచుండెను. ఆ సందర్భమున యుక్తవయస్కుఁడైన యా యరుణుఁడు తన తలిదండ్రులఁ గూర్చి తాత నడిగెను. అంత నతఁడు తనకుఁ దెలిసినంతవఱకు వానినిఁగూర్చి మనుమనికిఁ జెప్పెను. అరుణున కెందుకో తన తల్లి మేవాడులోనే తప్పక యుండునని తోఁచెను.

పిదప నరుణుఁడు "తాతా! నీ సోదరుఁడు మహారాణా ప్రతాపుఁడు స్వదేశమునకై ప్రాణముల నర్పించియుండ, నీ వేల మేవాడును విడిచి యిచటనుంటి"వని యడిగెను.

అందుకు సగరసింహుఁడు "ముగలులు బలవంతులు, రాజపుత్రులు బలహీనులని నా సోదరున కెంత చెప్పినను వినక నాతఁడు దుర్బలపక్షము నవలంబించి, యకాలమృత్యువునోటఁ బడియె. నేను బలవంతులగు ముగలుల పక్ష మవలంబించి, యింతవఱకు సుఖముగ జీవించుచుంటి" నని బదులు చెప్పెను.

అనూపుఁడు:— తాతా! దేవాసుర యుద్ధమున నెవరు బలవంతులో తెలియలేదా?

సగర:— ఇంతటితో నేమయ్యె. ముసల్మానులసంఖ్య తగ్గినను, హిందువులను దమ మతములోఁ జేర్చుకొని తమ సంఖ్యను వృద్ధిచేసికొందురు. హిందువు లట్లు చేయఁగలరా? ఒక పర్యాయము హిందువు మహమ్మదీయమతము స్వీకరించిన మీఁదట వానిని హిందువులు తిరిగి తమ మతములోఁ జేర్చుకొనరు. మీ మామ మహాబత్ ఖానుఁ డతి సులభముగ మహమ్మదీయుఁ డయ్యెను. కాని వారి యబ్దుల్లా యెన్నటికైన హిందువు కాఁగలఁడా?

అను:— తాతా! మామ మహమ్మదీయుఁ డెట్లయ్యెను?

సగ:— దానికి నేనే కొంతవఱకుఁ గారకుఁడను. నేను ముగలుల పక్ష మవలంబించితినే కాని వారి మతము స్వీకరించుటకు సాహసించలేదు. కాని నా కొడుకు సాహసించి, జంకులేక మతమును మార్చుకొనెను. నేను ముగలుల కొలువులోఁ జేరకుండినయెడల నాతఁడు ముసల్మానగుటకు సాహసించెడి వాఁడు కాఁడు.

అని వారిద్దఱు నిట్లు సంభాషించుచుండ ముగల్ సేనాపతి యగు నబ్దుల్లా ప్రవేశించి, "మహాప్రభూ! ముగల్ పాదుషా

తెమ్ము మేవాడు రాణాగా నియమించెను. తాము వెంటనే చిత్తూరు పోవలసియున్నది. అదియే తమ రాజధాని. అమర సింహుఁడికమీఁదట రాణాగా నుండఁడు. చక్రవర్తి యతనిని సింహాసన భ్రష్టునిగఁ జేయును." అని చెప్పెను.

సగర :- అమరసింహునితో నిట్టి పరిస్థితులలో యుద్ధము చేయఁ జాలను, యుద్ధము చేయలేకయే కదా మొగలులకు దాసుఁడనైతిని! స్వదేశమునకై యుద్ధము చేయకపోఁగా, సందుకు విరుద్ధముగఁ బోరాడుదునా?

అబ్దు :- తమకు పోగనక్క అక్కెను. ఆపని మేము చేఁగుదుము. తామూరక చిత్తూరులో రాణాగానుండినఁ జాలును.

సగర :- ఒకవేళ నమరసింహుఁడే నాపై దండెత్తిన నే నేమి చేయఁగలను? నాకీబాధ యేల? నేను రాణాగానుండుటకు సమ్మతించను. క్షమించుఁడు.

అబ్దు :- నాతోఁ జెప్పినఁ బ్రయోజనమేమి? ఇది పాదుషా యాజ్ఞ. తామేదైనఁ జెప్పఁదలఁచిన నాతో స్వయముగ మనవిచేసికొనుఁడు.

"సరియే పోవుదము రండు. కాని యిది చాల నీచమైనపని. మీరు నన్ను బలాత్కరించి రాణాగాఁ జేయఁదలఁచితిరా! ఏమగునో చూచెదనుగాక! ఇది చాల యక్రమ"మని చెప్పుచు సగరసింహుఁడు నరునితో వెడలిపోయెను.

## ప్రేమభంగము

మానవతి యొకనాఁ డుద్యానంబున విహరించుచు, నచటి లతులతానికుంజముల రామణీయకంబును గాంచియు, భూరుహా

శాఖలపైనుండి చేయు శుకపికరవంబుల నాలకించియుఁ దన్మయు రాలై యావేళ కనుకూలించు మలయమారుతరాగంబు నాల పించి యొక గీతంబును బాడుచుండ నజయుఁడు ప్రవేశించెను.

ఆమె హృదయంబున నప్పటికే యాతనిపై ప్రేమ జనించెను. ఆతనిఁ గాంచకున్న దినమొక్క యుగముగా నామెకుఁ దోచుచుండెను. ఇది యామె తండ్రికిఁ గూడఁ దెలిసెను. కాని యతఁడు మిన్నకుండెను.

మానవతి యుద్ధక్షేత్రమున మానవుని దౌర్బల్యమును ప్రత్యక్షముగఁ జూచెను. "కాలము తప్పివచ్చినపుఁ డెంత ప్రతిభాశాలి యైనను శత్రువుల ఖడ్గప్రహారంబులకు లోనై దిక్కులేక పుడమిపై నొరగును. ఎప్పటికైన మృత్యువు పాలిటఁ బడవలసిన యీదీనమానవులు పరస్పరము ప్రేమించుకొనుటకు బదు లొకరి నొకరు ద్వేషించుకొనుచు దేశకళ్యాణమునకు భంగకరములగు యుద్ధములఁ దెచ్చిపెట్టుకొందురేల" యని యామె తీవ్రముగా నాలోచించుచుండెను.

దేవాను యుద్ధభూమియందు నామె ముఖమునఁ గాన్పించిన యా దివ్యకాంతినే యీనాఁడును దగుపడుచుండెను. కాని యుభయుఁ డానాఁడు తాను మోహపరవశుండై యామె కరమును బట్టుకొనఁబోవుట గొప్ప పొరపాటని గ్రహించెను. ఆమె సామాన్యమానవకన్య కాదనియు, నొక దేవకన్య యనియు, దా నామెను ప్రేమించుట కర్హుఁడఁ గాననియు, నామెయందు భక్తిని జూపఁదగుననియు ననుకొనెను. కాని 'బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి' యనిన ట్లాతఁ డామెదయ నపేక్షించుచుఁ దనకోరికను నెఱవేర్పు మని వేఁడుచు నామె కరంబును బట్టుకొనెను.

ఆసమయమున రాణి ప్రవేశించెను. అజయుఁడు రాజకుమారి చేయి విడిచి వెనుకకుఁ బోయెను. ఒంటరిపాటున నజయుఁడు మానవతితోఁ బ్రసంగించుట రాణికిష్టము లేదు. అది గ్రహించి యతఁడామెను క్షమార్పణ వేఁడెను. ఆతని ప్రవర్తనను సమర్థింపఁబూనిన తన కుమార్తెను రాణి మందలించి, లోనికిఁ బొమ్మనెను. అజయుఁడును రాణియభిప్రాయమును గ్రహించి, విఫలమనోరథుండై వెడలిపోయెను.

మానవతి తన ప్రేమకు భంగము వాటిల్లినందుకు నెంతయు దుఃఖింపసాగెను. ఇది రాణా కనిపెట్టి రాణితోఁ దమపుత్రిక యొక సాధారణవ్యక్తి కాదనియు, నామె యొక దివ్యశక్తి యనియు, నామె విషయములో నెంతమాత్రము జోక్యము కలిగించుకొనవలదనియు, నామెకు నాగ్రహము కలిగినయెడల, నెరికిని గానరాక యదృశ్య కావచ్చుననియు, నెంత చెప్పినను, రాణికి మనశ్శాంతి కుదురదయ్యె. ఈబిడ్డ ముందుజీవిత మెట్లు లుండఁబోవునా యని యామె దిగులుపడుచుండెను.

## మరల యుద్ధసన్నాహము

దేవారు యుద్ధముతోఁ బోరాటము పూర్తికాలేదు. మేవాడును సంపూర్ణముగా నాశనము చేయువఱకు ముగలులు యుద్ధము మానఁదలచలేదు. వారు క్రొత్తసేనలను సమకూర్చుకొని మేవాడుపై మరల దండెత్తిరి. దేవారుయుద్ధమున రాజపుత్రులు గెల్చినను సగముకంటె నెక్కుడు సేన నశించినది. ముగలులతోఁ బోరుటకుఁ గావలసినంత సేన వీరికి లేదు. కావున నీసారి ముగలులతో యుద్ధము చేయుట వ్యర్థమని తలఁచి రాణా

యూ ప్రయత్నము మాని మిన్నకుండెను. గోవిందసింహుం డెంత ప్రేరేపించినను నతఁడు వినలేదు.

అట్టియెడ నా చారణివచ్చి ముగలులు దేశముపై దండెత్తి వచ్చినను రాణా యుద్ధసన్నాహ మేమాత్రమును జేయక, వారితో సంధిచేసికొన నుద్యుక్తుఁ డగుచున్నట్లామె గ్రహించి, "మహారాణా! దేవారు యుద్ధమున గెల్చియు, నీ సంధి ప్రయత్న మేల? శత్రువులపై నఖండవిజయము సంపాదించి, గౌరవస్థానము నలంకరించిన తా మవమానకరముగ వారితో సంధిజేసికొన నుద్యమించుట న్యాయమా?" అని యడిగెను.

రాణా :- చారిణీ! దేవారుయుద్ధమున మనకు జయ మెట్లు లభించినది? మనసేనలో సగము నశించెను. ఎందఱో వీరులు తమ రక్తమును ధారపోసిరి. అట్లుగాకున్న మన కీ విజయము కల్గెడిదా?

చారిణి :- దేశము కొఱకై ప్రాణత్యాగము చేయుటలోనే వాస్తవికసుఖము కలదు. ప్రాణభీతిచే దేశమునకై పోరాడ కుండుట యెంత దుఃఖకరము!

రాణా :- ఈసారి యుద్ధము నిష్ఫలమగును. పైగా నీ యుద్ధమున కంత ముందునా? ఈ స్వల్పసేనతో మనము ప్రపంచ మంతయు జయింపఁజాలు ముగలుసేనను రణరంగమున నెదుర్కొనుటకన్న నాత్మహత్య చేసికొనుట మేలుకదా!

చారణి :- జయాపజయంబులను, లాభాలాభములను లెక్క చేయక ధర్మయుద్ధమును జేయువాఁడే వాస్తవికవీరుఁడు. ఇట్టి వాఁడే లోకమాన్యుఁడు. వీనికీర్తియే యాచంద్రతారక ముగ నిల్చియుండును.

రాణా :- ఈ యుద్ధములో సర్వము నాశనమగుట నిశ్చయము.

చారణి .- మహారాణా ప్రతాపుని కుమారునకు "స్వధర్మే నిధనం శ్రేయః" అను గీతావాక్యమును జ్ఞప్తికిఁ దేవలసి యుండునా? ప్రాణభీతిచే మన ప్రియజననిని శత్రువుల కప్పగింతుమా? వేలకొలఁదిసంవత్సరములనుండి మన భారతీయ సంస్కృతికిఁ జిహ్నమై యెంతటివీరులనో బలిఁగొన్న యీ యరుణపతాకమును శత్రువులకుఁ జిక్కనిత్తుమా? పరీక్షిన్మహారా జెంత ప్రయత్నించినను మృత్యువునుండి తప్పించుకొనఁ గల్గెనా? ఫలాపేక్ష లేక నీవిధిని నీవు నిర్వర్తించుము. లెమ్ము. యుద్ధమునకు సంసిద్ధుఁడవు కమ్ము.

రాణా :- చారణీ! నీయనుగ్రహమున నాసందేహము వీడినది. కర్తవ్యజ్ఞానము లభించినది. నీవు చెప్పినట్లే చేయుదును. కాని నీవు కేవలము చారణివిగాఁ గనుపించుట లేదు. నీ వెవరవో చెప్పుము.

చారణి :- మహాప్రభూ! అడిగితిరి కాన఼ఁ జెప్పక తప్పదయ్యెను. రాణా ప్రతాపుని సోదరుఁడగు సగరసింహుని పుత్త్రికను. నా పేరు సుభాషిణి.

రాణా యది విన్నంతనే, "ఏమీ! నీవు నా సోదరివా! కనుకనే యిట్టి యసమానపౌరుషము నీలో గోచరించుచున్న" దని మిగుల నాశ్చర్యముతోఁ బలికెను. అంత సుభాషిణి "మహారాజా! నేను సగరసింహుని కూతునని చెప్పుకొనుటకు నా కెంతయో సిగ్గగుచున్నది. నా తండ్రి మొగలులకు దాసుఁడై తన సోదరులకు తమ్ము సింహాసనభ్రష్టులఁ గావించుటకుఁ జిత్తూరుకోటలో రాణాగాఁ బనిచేయుచున్నాఁడు. ఆయన

పుత్రికనగు నేను మేవాడు ప్రజలలో దేశాభిమానమును గలిగించు గీతములఁబాడుచు, సగరసింహుఁడు వాస్తవముగా మేవాడురాణా కాఁడనియు, నతనికిఁ బన్నుఁజెల్లించ నావశ్యకత లేదనియు బోధించుచు, దేశసేవకై సమస్తసుఖములను బరిత్యజించి, సన్న్యాసిని వేషముధరించి వనపర్వతములలో దేశకీర్తిని గానముచేయుచుఁ దిరుగుచుండఁ, దమ రీ ప్రియమైన జన్మభూమిని నాశనము కానిచ్చుట ధర్మమా?" యని యశ్రుపూర్ణాయతేక్షణయై పలికినంత నా రాణా, "సోదరీ! నీ విట్లు దేశమునకై యింత త్యాగము చేయుచుండ, నీ సోదరుఁడను, నీ దేశమునకు రాజును నగు నేను దేశరక్షణకై ప్రాణములనయిన మర్పింపకుందునా?" యని యామెను సంతోషపఱచి, యుద్ధసన్నాహము చేయింపుమని గోవిందసింహున కానతిచ్చెను.

## భ య భ్రాం తి

సగరసింహుఁడు చిత్తూరుకోటలో రాణాగా నుండెనే కాని యతనికి మనశ్శాంతి లేదు. ఆకోటకు సంబంధించిన పూర్వగాథ లన్నియు నతనికి జ్ఞప్తికి వచ్చుచుండెను. ఏకాంతమున నచట నుండఁజాలక యెక్కుచో భయభ్రాంతుఁ డగుచుండెను. ఒక్కొక్కప్పుడు చారణ, చారిణులు చెప్పు భారతవీరుల కథలు వినుచుండెను. ఒక ప్రక్కన ప్రచండమారుతము వీచుచుండ దానితోఁబాటు టతని హృదయము మఱింత కలవరపాటు నొందఁజొచ్చెను. కంటికి నిద్రలేదు. ఎటుచూచినను గాఢాంధకారమే. ఆనాఁడు కాపలావానినిఁ దగు జాగరూకతతో నుండుమని యతఁడు హెచ్చరించెను.

సగరసింహుని మనోవేదనకుఁ గారణ మతని కలుషిత జీవితమే. అది యాతని యెఱుకలేకయే యాతని బాధింపఁ జొచ్చె. పాపఫల మేరికిని ననుభవింపక తప్పునా? ఆ ప్రదేశ మందలి ప్రతి దృశ్యమును బ్రతిధ్వనియును నాతనికి విపరీతముగఁ దోఁచి, యాతని మనంబును గలవరపఱచుచుండెను. ఝంఝా మారుతము 'ఘోరు'మని వీచుచుండ నా ప్రళయధ్వను లాతని చెవులకు భూతపిశాచముల కేకలవలె వినవచ్చుచుండెను. ఉఱుములు, మెఱుపులు మాడఁ బ్రకృతి మాటిమాటికిఁ దన గ్రుడ్లెఱ్ఱజేసి యాతనిపై నాగ్రహముతో గర్జించుచున్నట్లు తోఁచె.

ఇట్లు సగరసింహుఁడు భూలోకనరక మనుభవించుచుండ నాతని ప్రక్క నే మంచముపైఁ బరుండియున్న యతని మనుమఁడు గాఢనిద్రలోనుండెను. అతనికి కలవరపాటులేదు. నిష్కల్మష హృదయునకు భయ మెందులకు? తాత భయభ్రాంతుఁడై యాతనిని మేలుకొలిప నప్పుడెల్ల నాతని భయమునకును, చిత్త భ్రమకును గారణమేమో యాతనికి గోచరింపకుండెను.

ఇంతలో సగరసింహునకు రాజపుత్రవీరులు కోపముతోఁ దన వంకఁ జూచుచున్నట్లును, వారు తన్నుఁ జంపవచ్చుచున్నట్లును భ్రమ జనించెను. అంతఁ దాను జిత్తూరు రాణాగా నుండుటకు బుద్ధిపూర్వకముగ రాలేదనియు, నన్యప్రేరణచే వచ్చితిననియు, సమరసింహుఁడే రాణాయనియు, దన్నుఁ జంపవలదనియు నఱచుచు మూర్ఛిల్లెను. అత్తఱి నా యరుణుఁడు తాతకు శీత లోపచారములఁ గావించి యాతని మూర్ఛఁ దేర్చెను.

# పతిభక్తి

గోవిందసింహుని కూతురు మంగళ. ఆమెతల్లి చిన్నతనముననే చనిపోయెను. ఆమెభర్త మహీపతిసింహుఁడు మహమ్మదీయ మతమును స్వీకరించి మహాబత్ ఖా నను పేరఁ బరగుచున్నను భారతనారీమణులకు సహజమగు పతిభక్తి యామెను విడువలేదు. ఆమె తండ్రికి ముసల్మానులపైఁ జాలక్రోధము కలదు. ఏడువందల సంవత్సరములనుండి స్వాతంత్రముగ నున్న మేవాడు రాజ్యమును దమస్వాధీనము చేసికొనుటకు వారు దానిపై విఱుచుకుపడుచుండిరి. కాని పర్వతముల డీకొని వెనుకకు మరలు సముద్రతరంగముల మాడ్కి వారు మాటిమాటికి నోడిపోయి వెనుకకు మరలిపోవుచుండిరి. మేవాడు వారి కేమియు నపకృతిఁ జేయకున్నను బలమదాంధులై, న్యాయాన్యాయముల విచారించక యా రాజ్యమును ధ్వంసముచేయఁ గృతనిశ్చయులై నందున గోవిందసింహుఁడు వారికిఁ దనకరవాలంబుచే బుద్ధిచెప్పుటకంటె వేఱొండుమార్గము లేదని భావించుచుండెను. తండ్రియొక్క ఘోరప్రతిజ్ఞను దలంచుకొనినపుడెల్ల నామెకు భయమగుచుండెను. విధర్ముఁడైనను తన పతియందుఁగల యచంచలభక్తిని బహిర్గతముచేయుట కామె సాహసింపకుండెను.

ఒక్కనాఁడు మానవతి యంతఃపురమున నుండ మంగళ యామెను జూడఁబోయెను. రాజకుమారి కుష్ఠురోగులకు నొక యాశ్రమమును స్థాపించి, వారికి నన్నవస్త్రములను, నౌషధములను భక్ష్యపానాదులను నిచ్చియు ననేకవిధముల సేవఁ జేయుచుండెను. మంగళ యామె మానవసేవాతత్పరత నెంతయుఁ బ్రశంసించెను. రాణాయంతటివాఁడు తనపుత్రిక చేయుచున్నపని

కెట్టి యసమ్మతిని దెలుపకున్నను, గొందఱు రాజకుమారి కీపని తగదని పలుకుచుండిరి. కాని మానవతి వారి యాక్షేపణముల నిసుమంతయు లక్ష్యపెట్టక, పరులను సుఖపెట్టుటలోనే వాస్తవిక సుఖము కలదనియు, స్వసుఖమునకై పాటుపడుట కేవలము స్వార్థమేయనియు, స్వార్థత్యాగము చేయువాఁడే ధన్యజీవి యనియు నామె దృఢముగా విశ్వసించెను.

అజయుఁడు మానవతిని నిజగురువుగా భావించి, యామె యుపదేశములను శిరసావహించి, యింట నొకక్షణమైననుండక, రోగులకు సేవచేయుటకో, దుఃఖభాజనుల నోదార్చుటకో నిరంతరము నెచటికో పోవుచుండును. మంగళను మాటిమాటికి మానవతి చెంతకుఁ బంపుచుండును. రాజకుమారి యజయుని వార్తల నామెమూలమున విని, మిగుల సంతసించి, "యాతఁడే స్వయముగ నన్నుఁజూడ నేలరాఁడు? ఆతనిఁజూడ నాహృదయ మారటపడుచున్నది. ఒక్కసారి యతఁడు నాచెంతకువచ్చునట్లు చేయు" మని యామెను గోరెను.

ఇంతలో రాజకుమారి యనుమతితోఁ జిత్రపటముల నమ్ము వనిత యొక్కతె లోనఁబ్రవేశించి, పెట్టెమూఁతతీసి యా చిత్రముల వారికిఁజూపెను. అందు వారివారి స్వభావములు వారి ముఖములందుఁ బ్రతిబింబించు చుండెను. అక్బరు పాదుషా ముఖమునఁ దీవ్రతతోఁబాటు దయయు-సుహృద్భావమును, జహంగీరు వదనమునఁ గపటమును-దృఢచిత్తమును, మానసింగుప్రభుని యాస్యమున ఖేదము-నిరాశయు, వానికిఁదోడుగ నాత్మగౌరవమును గన్పించుచుండెను. అంత నాచిత్రపటముల నమ్ము స్త్రీ ప్రత్యేకముగా ముగల్ సర్వసేనానియగు హిదాయతు ఆలీఖాను చిత్రమునుజూపి, యాతని సౌందర్యమును

దానే మెచ్చుకొనెను. మానవతి యాచిత్రమువంకఁ గొంతవడి చూచి, పక్కన నవ్వెను. ఆ ముఖమున మూర్ఖత్వము, నహంకారము, క్షుద్రతయును గోచరించుచుండెను. తుదకు మహాబత్ ఖాను చిత్రముఁ జూచిరి. అది యెంతగంభీరముగా నున్నది! ఆముఖమున సహజవీరలక్షణము లుట్టిపడుచుండెను. ఉన్నతమైన నుదురు, దృష్టిలోఁ దీక్ష్ణత, ముఖమున క్షాత్ర తేజము, మనోదార్ఢ్యము, నౌదార్యము, నాత్మగౌరవమును స్పష్టముగా భాసించుచుండెను. మంగళయుఁ గొంత నిరాశతో నా ముఖమువంకఁ జూచెను. అంత నా రాకుమారి యక్బరు, జహంగీరు, మానసింహ్, మహాబత్ ఖానుల చిత్రముల నైదు మొహారీలకు గొనెను. చిత్రముల నమ్ము లలన రాకుమారి చిత్రమును గీయఁ దన యభిలాషను వెలిబుచ్చెను. కాని రాకుమారి యందుకు సమ్మతింపక, యామెను బంపివేసెను.

పిమ్మట మానవతి మంగళయొక్క మనోగతభావంబును గ్రహించి, "యెవ్వని చిత్రము జాలశ్రద్ధతోఁ జూచుచుంటి"వని యనుగ, నామె బదులుచెప్పక చిత్రములఁ గలిపివేసెను. అంత మానవతి మహాబత్ ఖాను చిత్రము నామెచేతికిచ్చి, "యిది కాదా నీవు చూచుచున్నది? నీ వింత సిగ్గుపడెదవేల? ఈయన నీ పతియే కదా" యనెను. మంగళ తలవంచుకొని, "కాని విధర్ముఁడు." అని విచారముతోఁ బలికెను. అందుకు మానవతి, "అతడు విధర్ముఁ డెట్లగును? అతనికి ధర్మము లేదా? ఇస్లా మొక ధర్మముకాదా? అన్ని ధర్మములు నీశ్వరనిర్మితములు కావా? అట్టియెడ విభిన్నధర్మావలంబకులలోఁ బరస్పర ద్వేష మేల? ప్రపంచచరిత్రలో ధర్మముపేరిట నెంత హత్యాకాండ జరుగలేదు? ఇది ధర్మమా?" అని పలికెను. మంగళ తాను

విధర్ముని ప్రేమించుట పాపమేమోయని సందేహించెను. కాని మానవతి యామె సంశయమును గ్రహించి, "మంగళా! ఎట్టి దుష్టునైనను ప్రేమించుట పాపముకాదు. పుణ్యమే. మిక్కిలి రోతగనుండువాడే యెక్కువ కరుణాపాత్రుఁడు. ప్రతి జీవి యందును, ద్విజునియందు, శ్వపచునియందును, గోవునందు, గజమునందును,సింహమునందును, శునకమందును, నింతయేల, సమస్త చరాచరప్రపంచమందును బరమాత్మ కలఁడు. ప్రేమింపఁ దగని వస్తువున్నదా? మహాబత్ ఖాను విధర్ముఁ డెట్లగును? అతఁడు ముసల్మాను ధర్మమునకు జెందినవాఁడు. అతఁడు పరమేశ్వరుని మఱియొక భాషలో 'అల్లా' యని పిల్చినంత మాత్రమునఁ బాపి యెట్లగును?" అని నొక్కి వక్కాణించెను. అంత మంగళకు మానవతియందు గురుభావము కలిగెను. వెండియు మానవతి "ప్రేమ జాతి మతభేదములఁ బాటించదు. 'వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః। నఖలు బహిరుపాధీన్, ప్రీతయ స్సంశ్రయంతే' అనినట్లు ప్రేమకు బాహ్య చిహ్నములతో నిమిత్తములేదు. అది సమస్తపదార్థములను గలుపు నొక యనిర్వాచ్యమగు శక్తి"యని యామెతోఁ బలికె.

ఇట్లు తన పలుకులచే నమృతము నొలికించుచున్న యా మానవతి ముఖంబును మంగళ ఱెప్పవాల్చక చూచుచుండెను. పిమ్మట మంగళ నిజగృహంబున కేగుట కామె యనుజ్ఞను వేఁడ, నా రాజకుమారి, "నీవు రేపు తప్పక రావలెను, అజయునిఁగూడ రమ్మని చెప్పవలయు"నని యామెతో ననెను.

# బ్రహ్మచర్యము

అమరసింహుఁడు తన పుత్రికను యోధపుర రాజకుమారుఁడగు యశోవంతసింహుని కిచ్చి వివాహము చేయఁదలఁచెను. ఈ విషయమును దెలుపుటకై సుభాషిణి కుమారుఁడగు నరుణసింహుని బంపిరని మానవతి తల్లివలనఁ దెలిసికొని విలపింపసాగెను. ఆమెకు వివాహము చేసికొన నిష్టములేదు. ఆమె తన జీవితమును వివాహబంధములోఁబడవేయఁ దలఁచలేదు. బ్రహ్మచారిణిగా నుండ నిశ్చయించి, తన దృఢనిశ్చయమును దన తండ్రికి నెఱింగింపఁదలఁచెను. ఇది రా కెంతమాత్రమును నచ్చలేదు. కూఁతున కెంత చెప్పిచూచినను ఫలితములేకపోయెను. బిడ్డకు మతిచెడిపోయెనని యామె తలఁచుచుండెను. రాణా యెంతమాత్ర మీ విషయములో జోక్యము కలిగించుకొనకుండుట యామె మనస్సునకు మఱింత కష్టము కలిగించెను. అంతనేమియుఁ దోఁచక, యీ సంగతి రాణాతోఁ జెప్పెను గాని యందు కాతఁ డేమాత్రముఁ జింతపడలేదు. మీఁదు మిక్కిలి తన పుత్రిక నిర్ణయమునకు మిగుల సంతసించెను. రాణి కలవరపాటాతనికి నిర్హేతుకముగఁ గన్పట్టెను. బిడ్డకు మతిపోయెనని రాణి యనుకొనుట గొప్ప పొరపాటని యతఁడు భావించెను. మానవతి యొక సామాన్య మానవకన్య కాదనియుఁ, దమపై ననుగ్రహాతిశయముచే భూలోకమున నవతరించిన తేజోరాశి యగు నొక దేవకన్య యనియు నతని దృఢవిశ్వాసము. కనుక రాణి యారటమంతయు నతనికి నసంగతముగఁ దోఁచెను. ఇఁక ముందు మానవతి వివాహప్రశంస తన ముందు తేవద్దనియు, మెదలక యన్ని విషయములఁ జూచుచుండుమనియు రాణితో గట్టిగాఁ జెప్పెను.

ఎంత చెప్పినను రాణిమనస్సు మారలేదు. తండ్రి పిచ్చియే కూఁతునకును సంక్రమించెనని యామె భయపడెను. ముందు ముందీవ్యవహారము లెట్లు పరిణమించునా యని యామె మిగుల వ్యాకులపడుచుండెను.

## మతద్వేషము

మంగళ ప్రతిదినము రాకుమారి యుపదేశము ననుసరించి తనపతిచిత్రపటమునకుఁ బూజసల్పుచుండెను. ఆ యలవాటు చొప్పున నొకనాఁడు చేతఁ బూలగుత్తినిడుకొని, యాచిత్రము వంక శ్రద్ధతోఁ జూచుచు "ప్రాణేశ్వరా! అంధకారబంధురమైన నా జీవితమునకు నీవే యాశాజ్యోతివి. నిన్నుఁ దనివితీర గాంచని నా కన్నులు కన్నులా? నీ మృధుమధుర వాక్కుల వినని నా వీనులు వీనులా? రేఁబవళ్ళును నిన్నుఁగూర్చి చింతించని క్షణముకలదా? స్వామీ! నిన్నుఁజేరి నీ కరుణా కటాక్ష వీక్షణములకుఁ బాత్రురాలనై, నీసాహచర్యసుఖంబు ననుభవింపఁజాలని యీజన్మమేల? నాథా! నాపై దయలేదా? ఎన్నటికైన నన్ను నీ యర్ధాంగినిగాఁ గైకొను సుదినము వచ్చునా?" యని యెంతయుఁ బరితపించుచు నశ్రుపూరిత నయనయై యా పుష్పగుచ్ఛంబును భక్తితో నాచిత్రపటముపై నుంచెను.

ఇంతలో గోవిందసింహుఁడు ప్రవేశించి, యామె చేయు పూజనుజూచి, "బిడ్డా! యీచిత్ర మెవరిది" యని యడుగ నామె "తన భర్తది" యని పలికెను. అందుకతఁ డులికిపడి, "ఏమీ! మహాబత్ ఖాను నీ నాథుఁడా! అతనిని నీవు పూజించుచుంటివా!" యని కోపాశ్చర్యములతో నడిగెను.

అనపుడు మంగళ, "జనకా! భారతీయ వనితకుఁ బతిని బూజించుట నేరమా!" యని సవినయముగఁ బలికి యాతని పాదములకు నమస్కరించెను. కాని గోవిందుఁడు క్రోధావిష్టుండై "మంగళా! నీకుఁ బతిలేఁడని యెన్నియోసార్లు చెప్పియుంటిని? మతభ్రష్టుఁడగు మహాబత్ ఖాను నీకుఁ బతి యెట్లగును?" యని ప్రశ్నించెను. అందుకు మంగళ "ముగ్ధనగు నాకు ధర్మశాస్త్రము కాని యాచారకాండ కాని యెట్లు తెలియును? అగ్నిసాక్షిగ నన్ను మహాబత్ ఖాను పెండ్లియాడెను. ఆయన సహధర్మిణినైన నన్ను నా జీవితేశ్వరునుండి వేఱుపఱచఁగల వారలెవ్వరు?" అని యడిగిన నా గోవిందుఁడు, మహాబత్ ఖాను ఇస్లాముమతమును గ్రహించుటలోనే యా వివాహ బంధమును స్వయముగా ఛేదించెనుగదా!" యనెను. మహమ్మదీయుఁడైన పిమ్మటఁ గూడఁ దన్నుఁ స్వీకరింపఁ గోరెనని మంగళ పలికినంత గోవిందుఁ డాగ్రహాపూరితుండై, "ఏమీ! ముసల్మానైన పిమ్మటఁగూడ గోవిందుని పుత్రికను నిజ పత్నిగాఁ గైకొనుట, కతని కధికారముకలదా? హిందూ ధర్మమును వీడి పరధర్మము నవలంబించుటతోనే నిన్నాతఁడు పరిత్యజించె"నని గంభీరముగాఁ బలికె.

ఇది వాస్తవమాయని సంశయించుచున్న యామెకు గోవిందుఁడు "మంగళా! నీవు మహాబత్ ఖానుకు వ్రాసిన లేఖగతి యేమయ్యెనో యెఱుఁగుదువా? నిన్నుఁ దానుఁ స్వీకరింపఁ జాలనని దానిపై వ్రాసి త్రిప్పికొట్టెను. నీకీ పరాభవముచాలదా?" యని యడిగి కోపముతోఁ బారవైచిన యా యుత్తరము నామె తీసికొని యాతురతతోఁ జదువఁదొడఁగెను.

ఇంతలో నజయుఁడు మొగలులు మరల మేవాడుపైదండెత్తిరను వార్తఁ దెచ్చెను. ఈసారి రాజకుమారుఁడగు పర్వేజు సేనాధిపతి; దీనికిఁదోడు సుమారు లక్షసైన్యమెత్తివచ్చుటచేత మేవాడ్ సర్వనాశనమగుటతథ్యమని గోవిందునిదృఢవిశ్వాసము.

ఇది యిటులుండ మంగళ యిప్పటికిని మహాబత్ ఖానును దన భర్తగా భావించుట గోవిందున కాశ్చర్యమును గోపమును గలిగించెను. కాని యామె యనురాగవంతుఁడగుఁ బతిని బూజించుటలో విశిష్టత లేదనియు, నాథునిచేఁ దిరస్కృత యయ్యు నాతని పాదములఁ బూజించుటయే సాధ్వీమణి లక్షణమనియు, సర్వకాల సర్వావస్థలందును నామె పతిభక్తి యచంచలమై నిరపేక్షమై, నిష్కల్మషమై, యయాచితమై, విల్లసిల్లుచుండుననియు, వనితలకుఁ బతియేదైవము, పతియే జీవనసర్వస్వమనియు నమ్మెను.

మంగళ పితృభక్తి యసమానము. ఇంతవఱ కామె తండ్రి మాటను జవదాఁటి యెఱుఁగదు. ఆయన గౌరవమర్యాదల కెట్టి భంగమును గలిగించలేదు. కాని యామెయుఁ దాను మహాబత్ ఖానును బతిగా భావించుటలో నెట్టి యపరాధము గన్పించలేదు. ఈ విషయములోఁ దండ్రి యభిప్రాయముతోఁ నామె యెంతమాత్రము నేకీభవించలేక పోయెను. ఆయన దేశమునకై సర్వముఁ ద్యాగము చేయ సంసిద్ధుఁడైనటుల నామెయుఁ దనభర్తకై యెట్టి త్యాగమునైనఁ జేయసిద్ధపడెను. ఆమె మనోనిశ్చయము నెవ్వ రడ్డుపెట్టఁగలరు?

గోవిందసింహుఁడు క్రోధపరవశుఁడై, మత్తోన్మాదియై తన యనుంగుబిడ్డ ప్రవృత్తిని సరిగా నర్థముచేసికొనలేక తొందరపడి

తూలనాడెను. కర్ణకఠోరములైన యా మాటలను వినఁజాలక యుజయుండు, "జనకా! కోపావేశముచే మంగళ పవిత్రమగు పతిభక్తి నిట్లు కళంకితమొనరించుట తమకుఁ బాడియా?" అని యడిగిన, నా గోవిందుఁడు "మంగళ పతిహీనయని చాలసార్లు చెప్పియుంటి" నని పలికెను. వెంటనే యామెయుఁ దనకు మహాబత్ ఖానే పతియని యెన్నియోసార్లు చెప్పియుంటినని నొక్కి వక్కాణించెను. "మహాబత్ ఖానువంటి నీచుఁడు, గుణహీనుఁ డామెకుఁ బతియెట్లగు"నని తండ్రి యడుగ, నామె, "అతఁడు మీకు నీచుఁడుగా గన్పట్టవచ్చును. కాని నాకతఁ డారాధ్యదైవమే" యనెను. అంత గోవిందుఁడు, "మంగళా! ఆ దేశద్రోహి, యా మతభ్రష్టుఁడు నా పుత్రికవగు నీకుఁ బూజనీయుఁడా? ఎంత దురదృష్ట"మని యాశ్చర్యపడెను. "ఏజాతివాఁడైనను, నే ధర్మమునకుఁ జెందినవాఁడైనను సతులకుఁబతియే దైవము. ఒకపర్యాయము స్త్రీ పురుషునిఁ బెండ్లాడిన మీఁదటఁ గష్టసుఖములలోను, జీవనమరణముల లోను, నిహపరములలోను నామె యాతని సహచారిణిగనుండఁ జనును. పతి సాన్నిధ్యమే సాధ్వికి స్వర్గము. పతివియోగమే నరక"మని యామె బదులుచెప్పె.

అపుడు గోవిందుఁ డామెతో, "ఇఁక నీవు నాయింటనుండఁ జనదు. నీ యిచ్చవచ్చినచోటికిఁ బొమ్ము" అని కఠినముగాఁ బల్కెను. అంత నజయుఁడు, "తండ్రీ! నీ బిడ్డ నిట్లు వెడలఁగొట్ట నగునా? తాము పెద్దలు. ఆమె యొకవేళ తప్పుచేసినను దాము క్షమించవలదా? 'సహసా విదధీత న క్రియా మవివేకః పరమా పదాంపద' మ్మన్నట్లు తొందరపడి యేపనిని జేయఁగూడదు. ఈయమూల్యమైన వనితారత్నము నిట్లు తృణీకరించి పోఁగొట్టు

కొనకుఁడు." అని యెంత చెప్పినను గోవిందుఁడు పెడచెవిని బెట్టి, "జాతిద్రోహిని ప్రేమించు మంగళకు దేశభక్తుఁడు నగు నాగృహంబునఁ దావులేదు. ఇట్టి యంతశ్శత్రువు నింట నుండ నీయరాదు. ఇది నా యంతిమనిర్ణయ''మని నిష్కర్షగాఁ బలికిన మీఁదట నామంగళ తండ్రికి భక్తితో నమస్కరించి పితృగృహంబును వీడఁబోవుచుండ నజయుఁడు, "తండ్రీ! యామెతో నేనును బోయెదను. అనుజ్ఞయిండు. ఈదుష్టజనభూయిష్ఠమగు ప్రపంచమున నబలయగు నీసాధ్వి నొంటరిగాఁ బోనిచ్చుట ధర్మమా? ఆమె భర్త ప్రస్తుతము దూరస్థుఁడుగా నున్నందున సోదరుఁడ నగు నేను రక్షణకై యామె వెంట బోయెదను. సెలవిం''డని సోదరితోఁ గలిసి వెడలిపోవుచుండ గోవిందుఁడు మాటాడఁజాలక నిశ్చేష్టుఁడై శిలావిగ్రహమువోలె నిలిచి యుండెను.

## హృదయపరివర్తనము

చిత్తూరుదుర్గసమీపమున సింహశార్దూలభల్లూకాది క్రూరమృగంబుల కావాసమగు నొక భీకరనిబిడారణ్యంబు కలదు. మధ్యందినమార్తాండుని చండమయూఖంబులు సయితమా కాంతారమును భేదించి లోనఁ జొరఁజాలవు. కావున నడివేసవిలోఁ గూడ మట్టమధ్యాహ్నపు సూర్యాతపము వనవాసులకు వెన్నెలవలెఁ దోఁచును. ఆకాననమున కెటుచూచినను గొండలే కన్పించును.

ఈ నిర్జనారణ్యమధ్యమున నా దుర్గములో నుండుట నగరసింహునకుఁ గారాగృహవాసముగ నుండెను. రాత్రిసమయమున నా పురాతనవృక్షము లాతనికిఁ గడుంగడు భయము

గొల్పుచుండెను. అందువలన నాతఁడా చిత్తూరుదుర్గమును వదలి యాగ్రాకు మరలిపోవఁ జూచుచుండెను.

కాని యరుణునకుఁ జరిత్రాత్మకమైన యాప్రదేశము మిగుల నానందదాయకముగ నుండెను. అచ్చటి ప్రతిపర్వతమును బూర్వపురుషుల గాథల నాతనిజ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. అరుణునకు సంతోషముగల్గించు నీప్రాచీన గౌరవస్మృతియే సగర సింహునకు ముదంబుఁ గూర్చకపోఁగా బాధకల్గించుచుండెను. తాత, మనుమల మనోవృత్తులలో నెంత యంతరము కలదు!

అరుణుని మాటలతీరు చూడఁజూడ నితండును దల్లియడుగు జాడలనే పోవునాయని తాతకు సంశయ మొదవుచుండెను. తనతల్లి యిట్లులనే పలుకుచుండెడిదని విన్నంతనే యరుణునకు నూతనోత్సాహము జనించెను. ఎట్టులైన నామెను వెదకి తీసి కొని రావలెనని యాతనిమనం బారటపడుచుండెను. ఈ భయంకరారణ్యమున నామె జాడఁ దీయుట దుర్లభమని తాత యెంత చెప్పినను వినఁడయ్యెను. తాత యాతనిని మఱపించుటకు నాగ్రాలోఁ బాదుషా యొక్క దివ్యసుందరభవనమును, నసంఖ్యాకములగు మసీదులను జూపించెదనని చెప్పి యెంత ప్రయత్నించినను, నవియాతని మనసు నిసుమంతయు నాకర్షింపఁ జాలకపోయెను. అరుణుఁడు తన యుద్రేకము నాపుకొనలేక, "తాతా? యాగ్రాకు నీవు వెళ్ళిన వెళ్లుదువుగాక, నేనుమాత్రము రాను. నాతల్లి యెచటనుండిన నదియే నాకు స్వస్థలము. ఆగ్రా నాకుఁ బరస్థలము. అచటనున్న దివ్యభవనముల కంటె నా జన్మభూమి యగు నీ ప్రదేశము నందలి శిథిలములైన కుటీరములు స్వర్గతుల్యములు కావా? పరులసేవఁ జేయుచు, నస్వతంత్రుఁడనై మహదైశ్వర్యములననుభవించుటకన్న దిక్కులేక

యనాథవై కడు నిడుమల గుడుచు మాతృసాన్నిధ్యమున నుండి గంజిత్రాగుచు జీవించుట వేయిరెట్లు మేలుకాదా! తాతా! పరుల యనుగ్రహము నపేక్షించి, స్వదేశమును స్వజనమును విడనాడి, నీవు పరులకు దాస్యము చేయుచుంటివి. ప్రతాపుని సోదరుఁడవగు నీకిది తగునా? పరాధీనతవలనఁగలుగు రాజ భోగముకన్న స్వచ్ఛందజీవనమునఁ గల్గు నష్టకష్టము లెన్నియో రెట్లు వాంఛనీయములు కావా?" యని పలికెను.

ప్రియసుతుని యమృతతుల్యవాక్కులను జాటుననుండి వినుచున్న సుభాషిణి, తండ్రికి విస్మయానందములు కలుగఁ దటాలున ముందుకువచ్చి "నాయనా! చిరంజీవివై వర్ధిల్లుము. దేశసేవకై సర్వమును బరిత్యజించి సన్న్యాసినినై యానాఁడు నిన్ను విడిచిపోవుట యెంతయో దుర్భరమయ్యెను. దేశసంచారముఁ జేయుచున్నప్పుడును నిన్ను మఱవఁజాలనైతిని. నీవిచట నుంటివని విన్నమీఁదట నొకనిముసమైనఁ దాళజాలక నిన్నుఁ జూడవచ్చితిని. నాకు నచ్చిన బిడ్డ"వని పలుకుచుఁ బరమానంద భరితయై యాతనిఁ గౌఁగిలించుకొనెను.

తనప్రియతనయ చాలకాలము క్రిందట నిల్లువిడిచి, తిరిగి తన భాగ్యవశమున నీనాఁడు మరలఁ గన్పించియుఁ, దనవంక నొక్కసారియైనను జూడకుండుటకు సగరుఁడు ఖిన్నుఁడై, యిట్లు తనయం దనాదరణ చూపుటకుఁ గతమేమని యడుగ, నామె, "జనకా! మీరు మీ పొరపాటును గ్రహించలేని స్థితిలో నున్నందుకు నాకుఁ జాలవిచారమగుచున్నది. మాతృదేశమును దిక్కులేని స్థితిలో వదలిపెట్టి యన్యుల యనుగ్రహము నపేక్షించితిరి. మనస్త్రీల నవమానించి, మనపురుషులను నిర్వీర్యులనుగాఁ జేసినవారికి మీరు దాసానుదాసులైతిరి. రాజపుత

స్థానములోని రాజ్యములన్నియు లొంగినను దానుమాత్రము లొంగక స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న మేవాడుపై మాటి మాటికి దండెత్తుచు, ననేక రాజపుత్రవీరుల రక్తపాతమునకుఁ గారకులైనవారి పక్షము నవలంబించితిరి. వారిని సంతోషపెట్టుటకుఁ దమసోదరుని పుత్రుఁడగు నమరసింహుని రాజ్యచ్యుతునిఁ గావించుటకును సిద్ధపడితిరి. ఇంతకన్న మహాపాతక మొండు కలదా ? తండ్రీ ! మీ జీవితపద్ధతికిని, మా జీవితపద్ధతికినిఁ బోలికలే"దని యావేదనతోఁ బలుకుచుఁ, బ్రియసుతుని తన వెంటఁ దోడ్కొనిపోవ సంసిద్ధురాలయ్యెను.

అంత నాసగరసింహుఁడు పశ్చాత్తప్తహృదయుండై, తనలో యుక్తాయుక్త వివేకజ్ఞానముదయింప వారిద్దఱిని బోవలదని నివారించి, "బిడ్డా ! నీయుపదేశంబు కతన నా జన్మభూమికి నేనొనరించిన యపరాధమును నేఁడుగ్రహింపఁగల్గితిని. నాకంటె వయసులో సహజముగఁ జాలచిన్నదానవయ్యు నాకుఁ గర్తవ్యజ్ఞానం బొదవింపఁ జేసితివి. ఇఁక మీఁదటఁ బరుల యనుగ్రహంబున గడుపు నీచపుఁ బ్రతుకునకు స్వస్తిచెప్పి, నా దేశముకొఱకు సన్న్యసించెదను. ఇది ముమ్మాటికిని నిజము" అని ప్రేమతో నామెను దగ్గఱకుఁ దీసికొనెను.

అంత సుభాషిణి తన జనకుని యద్భుతమైన హృదయపరివర్తనమునకు మిగుల నాశ్చర్యపడి, తన తండ్రిని, గొడుకును నొక్కనాఁడే కలిసికొనఁగల్గినందుకుఁ బరమానంద భరిత యయ్యెను. కాని యిది యంతయు నమ్మఁజాలక కలయాయని సంశయించుచున్న కూఁతునకు సగరసింహుఁడు పూర్తిగ దస

మాటలయందు నమ్మకము గల్గించి, యామె కుమార్వణ వేఁడ, నామె తన పితృభక్తిని బ్రకటించుచు, నాతని పాదములపై వ్రాలెను.

## కామనేరు యుద్ధవిజయము

కామనేరు కదనరంగమున నిరుపార్శ్వములవారు యుద్ధమునకు సన్నద్ధులై యుండిరి. పరవేజ్ నాయకత్వమున ముగలు సైనికులు రాజపుత్రులపై నీతూరిదైనఁ దప్పక విజయము సాధించి, మేవాడునుగూడఁ బాదుషా స్వాధీనము చేయవలెనను దీక్షతో ముందుకు సాగుచుండిరి. వారి బాలచంద్ర కేతనము శత్రులఁ దెగటార్చుటకు నాత్రపడుచున్నదో యనినట్లు గాలి విసరులకు 'టపటప' కొట్టుకొనుచుండెను. వీరి సేనలోఁ బఠానులు, పారసీకులు, నరబ్బులు, నబిసీనియనులు మున్నగు వివిధ జాతులవారున్నను, వారందఱు నొక్కమతమునకు జెందినవారగుటచే, వారిలో నైకమత్యము సహజముగ నుండెను. అటు రాజపుత్రులసేనలు రథగజతురగపదాతులతోఁ గూడినవియై యెవ్విధంబునైనఁ దమ స్వాతంత్ర్యమున కెట్టిభంగము వాటిల్లకుండునట్లును, జిరకాలాగతమైన తమవంశపు గౌరవమున కెట్టి కళంకము నాపాదించకుండునట్లును దుదివఱకుఁ బోరఁ గృతనిశ్చయములై శత్రువులరాక కెదురుచూచుచుండెను.

ముగల్ సేనలు రాజపుల్ర సైన్యముల సమీపింపఁగనే మతావేశముతో "అల్లాహో అక్బరు" అను భీషణరవములతో శత్రువులపై లంఘించెను. రాజపుత్రులును 'హరహర' నినాదములఁ జేయుచు వారితోఁదలపడిరి. ప్రొద్దెక్కినకొలఁది సంగ్రామ

మతితీవ్రరూపముఁ దాల్చుచుండెను. ఎటుచూచినను గరవాలముల ఝుణత్కారములును, దుపాకుల పెళపెళలును వినవచ్చుచుండెను. తలలు తెగి, నెత్తురు పైకిఁ జిమ్ముచున్నను, మొండెములే కొంతవడి పోరాడి, క్రిందఁబడుచుండెను. ఈ శత్రువుల తుపాకి గుండ్లకు దాళఁజాలక మదగజంబులు బెదరి స్వసైనికులనే కాళ్ల క్రిందఁ బడవైచి మట్టగించుచుండెను. రథంబులు నేలఁ గూలినను, హయంబులు హతమైనను, ధైర్యమువీడక పౌరుషముతోఁ బోరాడు యోధాగ్రేసరు లిరుపక్షములఁ గానవచ్చిరి.

చాలసేపటివఱకు ముగలులు గెలుచుసూచనలే కానవచ్చెను. అట్టియెడ రాజపుత్రులు తమ బుద్ధికుశలత నుపయోగించి వారి కాహారపదార్థములు వచ్చు మార్గముల నడ్డగించిరి. ఆ భయంకరారణ్యములో నన్యమార్గము లేవియు ముగలులకుఁ దెలియవు. కావున నాఁకటిబాధతో వార లెంతదనుక పోరు సాగింపఁగలరు? విజయలక్ష్మి మరల రాజపుత్రులనే వరించెను. ఈకామనేర్ యుద్ధ మితిహాసపు పుటలలో సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది యయ్యెను. ఈ యఖండవిజయవార్త మేవాడ్ రాజ్యమంతయు విద్యుద్వేగముతో వ్యాపించెను. ఆనాఁడు లంకను జయించిన పిమ్మట శ్రీరామచంద్రుఁ డయోధ్యాపురంబుఁ బ్రవేశించిన విధంబున, సమరధరణీవరుఁడు 'జగద్గర్వ'మను తన మదగజంబు నధిరోహించి, యుదయపురంబు ప్రవేశించె. సభాభవనంబు సమీపించఁగనే యాతని సామంతులతని కెదురువచ్చి 'రాణా అమరసింహాకీ జయ్' అను విజయధ్వానములతో నాతనిని లోనికిఁ దోడ్కొనిపోయిరి.

రాణా సింహాసనాసీనుఁడైనతోడనే యాస్థానకవి విజయగేయంబులను గర్ణపేయంబుగఁ బాడెను. ఇంతదనుక వెలుపల నుండి యీ గీతమును వినుచున్న సుభాషిణి లోనఁబ్రవేశించినంత రాణా సింహాసనంబు డిగ్గి యామెను సగౌరవంబుగ నుచితాసనంబుపైఁగూరుచుండబెట్టెను. కామ నేరుయుద్ధవిజయానంతర మానందోత్సాహములతో నుండవలసిన యాశుభదినంబున రాణా వదనంబున నిరాశానిరుత్సాహంబులు కాన్పించుచున్నందుకు నివ్వెఱపడి యామె, "మహారాజా! మేవాడు రాజ్యమునకు గౌరవప్రదమగు నీ విజయదినంబునఁ దామేల విచారగ్రస్తులరుగ నుంటి"రని యడుగ నా రాణా, "సుభాషిణీ! యీయుద్ధమున యథార్థముగ గెల్చినది మననేనా?" యని ప్రశ్నించెను. అందు కామె, "మనముకాక మఱెవ్వరు గెల్చిరి? ముగలులు గెల్చిరా?" యని యాశ్చర్యముతో నడిగెను. రాణా యామెప్రశ్నకు సమాధానముగ, "సోదరీ! ముగలులు కాదు, రాజపుత్రులే గెల్చిరి. కాని యొక భవనమును నిర్మించునపుడు సణగక, గోణగక తమజీవితములో సూర్యరశ్మినిజాచు ప్రాప్తములేక, యావజ్జీవన మా భవనపు పునాదులలోఁ బడియుండి, భవనభారమును మోయు నాధారశిలల త్యాగము నెవరు గుర్తింతురు? అవి కీర్తి నభిలషించునా? తళతళ మెఱయు భవనశిఖరము మాత్రమే లోకులదృష్టి నాకర్షించును. ఒక్కొక్కప్పు డా శిఖరముపై వాయసము కూర్చుండ వచ్చును. కాని దానిని గౌరవింతుమా? ఆనాఁడు హతశేషులమై సమరభూమినుండి సగర్వముగాఁ బతాకముల నెగురవేయుచు, విజయభేరిని మ్రోగించుచు, దిక్కులు మాఱుమ్రోగునట్లు

విజయధ్వానంబులఁ జేయుచు మరలివచ్చిన మనమేనా విజయము సాధించినది? ఫలాపేక్షయే లేక మాతృదేవీ క్లేశ నివారణమునకై యా రణక్షేత్రమున దమ యమూల్యములగు ప్రాణంబులఁ బణంబుగానొడ్డిన యా వీరాగ్రేసరు, లా శౌర్యధను, లా మహాత్యాగు, లీ విజయసౌధంబున కాధారశిలలు కారా? ఈ విజయము వాస్తవముగ వారిదికాదా? వారి నీనాఁడు స్మరించుటకన్న వేఱొండు కర్తవ్య మేమి కలదు?" అని సవిమర్శకముగాను, నావేశజనకముగాను బలికెను.

అనవుడు సుభాషిణి, "మహారాజా! తమవలన నే నీనాఁ డెన్నియో యశ్రుతపూర్వములగు విషయముల గ్రహించితిని. ఆ రణరంగమున మడిసిన యా మహాపురుషుల కీర్తి భారత చరిత్రలో నాచంద్రతారకముగ నిల్చియుండునటుల నీశ్వరుఁ డనుగ్రహించుఁ గాత!" మని నుడువుచుఁ దనతండ్రి సగర సింహుఁడు నిజసోదరుఁడగు నమరసింహునికిఁ జిత్తూరుదుర్గమును వదలిపెట్టెననియు, రాణా నిరాటంకముగఁబోయి యా దుర్గము నాక్రమించవచ్చునను శుభవార్త నాతని చెవిని బడవేసెను. అది విని రాణా, "ఏమీ! యిదిసత్యమా! నాజనకుని జీవితేచ్ఛ నేఁడు ఫలించినదా? కాని యా సగరసింహుఁ డకస్మాత్తుగ మనకొఱకా దుర్గము నేల విడిచిపెట్టె? పాదుషా యాయన నట్లు చేయుమని యానతిచ్చెనా" యని యాతురతతో నడిగెను. అందు కామె, "పాదుషా యాజ్ఞచే నటుల గావింపలేదు. ఆయనకుఁ బాదుషా చిత్తూరు దుర్గమును సర్వాధికారములతో నిచ్చివేసె. కావున నాయనయుఁ దమ కా దుర్గమును సంతోషపూర్వకముగ నొసంగి, యాగ్రాకు వెడలిపోయె"నని బదులు చెప్పెను.

చిరకాలమునుండి శత్రువుల వశముననున్న చిత్తూరుకోట మరల స్వాధీనమైనందుకు రాణా మిగుల సంతసించెను. స్వర్గస్థుఁడగు తన జనకుని కోరిక తన పరాక్రమముచేతఁ గాకున్నను నాయన సోదరుని దానముచేతనైన నీనాఁటికి నెఱవేఱినందున వెంటనే యా దుర్గము నాక్రమించుటకు, సేనల నాయత్తపఱచి, తుదివఱకు యుద్ధము సాగింపుఁడని సామంతుల కాజ్ఞాపించెను.

## నిర్వాసితులు

అది సంధ్యాసమయము. పితృగృహంబును వీడిన యజయుండును, మంగళయును దిరిగి తిరిగి వేసారి యొక యూరి వెలుపట కాలిదారిని వచ్చుచు నొక శిథిలమగు కుటీరంబు సమీపించిరి. ఎన్నఁడును నింతదూరము నడచి యెఱుఁగని యా కోమలాంగి యా వన పర్వతస్థలములలో నడచి, నడచి, పథిక శ్రమంబున కోర్వఁజాలక, యొక్కయడుగైన ముందుకుఁ బెట్టనోపక, క్షుత్పిపాసాపీడితయై యచ్చట నిల్చిపోయెను. అజయుఁడామె స్థితికి జాలిపడి యచ్చోట విశ్రమింప నిశ్చయించెను.

ఆ కుటీరము తలుపు తీసియున్నను లోనఁ జీఁకటిగ నుండెను. లోపల నెవ్వరు నున్నట్లు కనిపించలేదు. మంగళ నచటనే యుండుమనియు నా యూరిలో నుండి యొక దీపమును, దినుటకేదేని భోజన పదార్థమును శీఘ్రముగఁ దెచ్చెదననియుఁ జెప్పి యజయుండు వెడలిపోయెను.

ఆమె యచట నొంటిగ నుండుటకు మిగుల భయపడుచున్నను, బాదములు నెత్తురు కమ్మియున్నను, దన జీవన

సర్వస్వమగు ప్రాణనాథుని గలియఁబోవుచున్నందున సంతోష పూర్వకముగఁ దా ననుసరించిన యీ కంటకాకీర్ణ మార్గ మామెకు సుగమముగఁ దోఁచెను. దారిలోవచ్చు నడ్డంకులను లక్ష్యపెట్టక ముదంబున నుప్పొంగుచుఁ దన పతియగు సము ద్రుని వైపు పురోగమించు నదీమతల్లివోలె నా పతివ్రతా శిరోమణి తన జీవితేశు నెప్పటికైనఁ జేరుకొన నిశ్చయించి, ముందుకు సాగుచున్నను, నాతఁడు తన నొక సేవకురాలినిగ నైన స్వీకరించునా యని సంశయించుచుండెను.

అట్టియెడ సన్యాసివేషమున నున్న సగరసింహుఁడు ప్రవే శించి తానెవరో యామెకుఁ దెలియఁజెప్పి, యామె రాజపుత్ర స్త్రీ యని గ్రహించి, భయమొందఁ జనదని ధైర్యముగల్పించి, యామె యొంటిగ నుండుటకుఁ గారణంబారసి, సోదరుఁడు వచ్చుదనుక నచటనే యుండి దుర్మార్గులనుండి యామెను రక్షించెదనని వాగ్దానము చేసెను. అందు కా యబల మిగుల సంతసించెను. కాని యామెకు భయమగుచునే యుండెను.

ఇంతలో ముప్పురు దొంగ లామె కొఱకై వెదకుచు వచ్చి లోనఁ బ్రవేశించిరి. వారిలోనొకఁడు మంగళను బట్టుకొనఁబోవ నామె దూరముగాఁబోయి బిగ్గరగా 'రక్షింపుఁడు,రక్షింపుఁ'డని కేకలువెట్టసాగెను. వెంటనే సగరసింహుఁడు వారి కడ్డుపడి యామెను గాపాడఁబోవ వా రతనితోఁ బోరఁదొడఁగిరి. సగర సింహుఁడు దొంగలతోఁ దీవ్రముగఁ బోరాడుచు నేలపైఁ బడెను. అంత మంగళ దిక్కులేనిదియై, యేమియుఁ దోఁచక యజయునికొఱకై యార్తనాదములఁగావించె. దైవవశమున నప్పటికి సమీపముననున్న యజయుఁడు తత్క్షణమే యచటి

కొంక పరుగునవచ్చి తన కరవాలంబున వారిని సంహరించి, తన సోదరిని గాపాడెను.

పిమ్మట నాస్త్రీని రక్షించిన వీరుఁడు మేవాడు సేనాపతి యగు గోవిందసింహునిపుత్రుఁడే యనియు, నామె తనకుఁ గోడలేయనియు వారివలన సగరసింహుఁడు గ్రహించెను. వారును నితఁడు బహాబత్ ఖాను తండ్రియగు సగరసింహుఁడే యని తెలిసికొనిరి.

## వివాహ దౌత్య వైఫల్యము

ఒకనాఁడు ప్రభాతసమయమున యోధపుర మహారాజగు గజసింహుఁడు తన రాజభవనమునఁ గొలువుతీర్చి యుండెను. ఆతని జ్యేష్ఠపుత్రుఁడగు నమరసింహుఁ డొక ప్రక్కనఁ గూరు చుండి యుండెను. రాణా యమరసింహుని దూతగావచ్చిన యరుణసింహుఁ డొక యాసనంబున నుపవిష్టుండై తావచ్చిన కార్యం బాతని కిట్లు విన్నవించె. "మహారాజా! మా రాణా పుత్రికను దమ సుతునికిచ్చి వివాహము చేయఁగోరి శుభ ముహూర్తము నిశ్చయించుకొని రమ్మని నన్నుఁ దమకడకుఁ బంపిరి. ఇందుకుఁ దమ యభిమతంబేమి?"

అక్బరుకాలమునుండి గజసింహుఁడును దక్కిన రాజపుత్రుల వలె మొగలులకు సామంతుఁడై వారి యనుగ్రహంబునకుఁ బాత్రుఁడై రాజ్యమేలుచుండె. మేవాడురాజ్య మొక్కటియే పాదుషాలకు లొంగక స్వాతంత్ర్యమునకై పోరాడుచుండుట యాతనికి గిట్టకుండెను. జహాంగీరు సామ్రాట్టునకుఁ దామెల్లను దాసులై యుండ మేవాడు మాత్రము స్వతంత్రముగ నేల

యుండవలయునని యతని కా రాజ్యముపై ననూయయు ద్వేషమును జనించెను. మొగలుసేనల సాహాయ్యమున మేవాడును ధ్వంసము చేయవలెనని నిశ్చయించుకొనకపూర్వ మీ వివాహ సంబంధమున కాతఁడు సమ్మతించి యుండ వచ్చును. కాని యిప్పు డీ ద్వేషము ప్రబలముగానున్న సమ యమున నాతఁడీ వియ్యమున కియ్యకొనునా ?

ఆ పేరోలగంబున నున్న తానసాసీనుఁడై నఁ గజసింహుఁ డా దూతతో, "అఖండభూమండలాధినాథుండగు ఢిల్లీ చక్ర వర్తికి ద్రోహులై, వారి యధికారము నంగీకరించని మేవాడు రాణాలతో మేమెట్టి సంబంధ బాంధవ్యముల నెఱపఁజాలము. తక్కిన సంస్థానాధీశ్వరు లందఱుఁ బాదుషాకు 'దాసోహ' మ్మనుచుండ మీ మేవాడు రాణాల కింత గర్వమేల ? మీ రాజకుమారి యగు మానవతికి మా పుత్రుఁడగు యశోవంత సింహునకు వివాహము పొసఁగ నేరదని మీ రాణాతో ఖండిత ముగాఁ జెప్పు" మని గర్వాతిరేకమునఁ బలికెను.

నావు డా యరుణుండు క్రోధారుణ నేత్రుండై, "మహా రాజా ! మా రాణాతో వియ్యమొందుటకు నంగీకరింపకున్న నంగీకరింపకుందురు గాక! కాని మా రాణాను మీరు విద్రోహి యని తూలనాడుచుండ విని సహింపఁజాలను. ఆయన విద్రోహి యెట్లయ్యెను ? మేవా డిప్పటివఱకు మొగలుల యధీనమున లేదు. అది తన స్వతంత్రతను రక్షించుకొనుటగాని, రక్షించు కొనఁ బ్రయత్నించుటకాని ద్రోహమగునా ? తక్కిన రాజ పుత్ర రాజ్యము లన్నియు, పరాధీనములై యుండ నీశ్వరాను గ్రహమున మా మేవాడురాజ్యము నేఁటివఱకు నిజగౌరవ

మును నిలువఁబెట్టుకొనుచు స్వతంత్రముగనున్నది. ఇది చూచి తామేల సహించలేకున్నారు? తాము రాజపుత్రులయ్యుఁ మాతృభూమిని శత్రువుల వశముచేయ సమకట్టుట ద్రోహము కాదా? సజాతీయమగు దారుఖండము విజాతీయ మగు లోహశకలముతోఁ జేరినప్పుడుకదా తరుజాలమునకుఁ గుఠారా ఘాతమువలన మూలచ్ఛేదమగును! సజాతీయుల విడనాడి విజాతీయులఁజేరి స్వజాతి వినాశమునకుఁ దాము సమకట్టుట ద్రోహముకాదు కాఁబోలు! మానధనులగు మన పూర్వుల వంశమున కెట్టి యవమానముఁ దెచ్చిపెట్టితిరి? ఇట్టివారితో మా రాణా వియ్య మొందకుండుట చాల శ్రేయస్కరము.” అని పలికెను.

ఒక బాలుఁడు దూతగవచ్చి నిండు కొలువులోఁ దన్ను బరాభవించి నందుకు గజసింహుఁ డుగ్రుఁడై, “బాలకా! మహా రాజు నగు నా ముందెవ్వరును నిట్లు మాటలాడుటకు సాహ సించలేదు. మీ రాణాకూడఁ గొలఁది సైన్యముతో మహా సముద్రమువలెనున్న పాదుషా సేనలతో యుద్ధము చేయుటకు నీ వలెనే సాహసించెను. ఇది యెంత వెఱ్ఱితనము!” అని పలుక, నా యరుణుఁడు “అంతపనిచేయుటకు వారు సాహసించిరి. కాని మీరు సాహసింపఁగలరా?” యని యెత్తిపొడిచెను. అందు కా గజసింహుఁడు, “డింభకా! నీవు దూతగా వచ్చితివి కాన వధ్యుఁడవుకావు. లేకున్న...” అని యేమేమో పలుకఁబోవు చుండ నరుణుఁడు, “మహారాజా! దూత యవధ్యుఁడని తమకుఁ దెలిసినందుకు నాకుఁ జాల యాశ్చర్యమగుచున్నది. తమకింత వివేచనాశక్తియున్నదని నేననుకొనలేదు. తాము మారాణాతో వియ్య మొందుటకు సమ్మతించకుండుట మంచిదియే. కాని

తాము పాదుషా పక్షమున నెన్నియో యుద్ధములఁజేసి వారిని గెల్పించితిరి. ఇటీవల గుజరాతును గూడ గెల్చి వారికి సమర్పించితిరఁట. కావున రాఁబోవు మేవాడు యుద్ధమునసైతము వారికే జయము సమకూర్చుటకుఁ దమరు తమప్రభుపక్షమున మా రాజ్యమునకు విచ్చేయుఁడు. ఆ యుద్ధమునకై తమ్ము హృదయపూర్వకముగ నాహ్వానించుచున్నాను.” అని పలికి యతఁడు సభను విడిచి పోఁబోవుచుండెను.

గజసింహుఁ డా బాలకుఁ డింత నిర్లక్ష్యముగా మాటలాడి నందుకుఁ గోపము నాపుకొనలేక తన కుమారుఁ డగు నమరసింహునివంకఁ జూచి, “కుమారా! ఆలసించెదవేల? పొగరుఁబోతుగఁ బ్రవర్తించిన యీ బాలకుని బంధించు”మని యానతిచ్చెను. అమరుఁడు వయసునఁ బిన్నవాఁడైనను రాజనీతి నెఱిఁగినవాఁడు. ధర్మాధర్మవిచక్షణాదక్షుఁడు. రాజపుత్రవంశజుఁడగుటంజేసి సహనసౌశీల్యాది గుణసంపన్నుఁడు. కావున తండ్రియాజ్ఞను వెంటనే నిర్వర్తింపక, “జనకా! ఇతఁడు దూతకదా! దూతపై నత్యాచారముఁ గావించుట క్షత్రియధర్మమా! రాజపుత్రులమై యుండి యిట్టి యకార్యముం జేయనగునా?” యని తండ్రి మాట కెదురాడెను. అంత నా గజసింహుఁ, డాతనిపైఁ గినిసి, “యమరా! నీవు నాకు ధర్మాధర్మముల నేర్పువాఁడవా? నీవు నా యాజ్ఞ నుల్లంఘింతువా? నా యాజ్ఞానుసారము నీ వీతని బంధించవేని నీకు నా రాజ్యము దక్కదని నమ్ముము. ఇది ముమ్మాటికిని నిక్కము. దూరదృష్టి గలిగి మెలఁగుము.” అని నిష్ఠురముగాఁ బలికెను. తండ్రిమాటల నతం డించుకయైనఁ బాటించక, ధైర్యముతో “తండ్రీ! రాజ్యమును మీరు నాకీయకున్నను సరియే. నే నిట్టి యన్యాయమునకు నెన్నఁడును

బాల్పడను. తమరాజ్యమును దామే దాఁచుకొనుఁడు. పరులచే నవమానింపఁబడుచు, వారి యనుగ్రహముపై నాధారపడి యీ రాజ్యభోగముల ననుభవించవలయునను కోరిక నాకు రవంతైన లేదు. నేను దమవలెఁ బరులకు దాసుఁడనై జీవిత మొక క్షణమైనఁ గడుపఁజాలను. సూర్యవంశజుఁడనై యిట్టి నీచపు బ్రతుకు నపేక్షింతునా? " యని గంభీరముగ భాషించి యీ సభాస్థలిని విడిచి యెచటికో పోయెను. సభాసదు లందఱు నాతని ధైర్యసాహసములఁ గొనియాడిరి. కుమారుని తెగువకు నచ్చెరు వొందిన గజసింహుఁడు నిశ్చేష్టుఁడై సింహాసనముపైఁ గూరు చుండి కొంతవడికిఁ దనప్రోలనున్న యరుణుని గాంచి, యత నితో "దూతా! నీవిఁకఁ బోవచ్చును. నిన్ను విడిచి పెట్టితి"నని పలికెను. ఆనాఁటి కా సభ ముగిసెను.

•

## గజసింహుని ప్రతీకారము

ఇంతవఱకు జరిగిన యుద్ధములలో ముగలులు మాటి మాటికిఁ బరాజయము నొందుచుండుటచే జహంగీరుపాదుషా రాజపుత్రుల నెట్టులైన లొంగఁదీయ వలెనని దృఢనిశ్చయుఁ డయ్యెను. ఇన్నిసార్లు తనసైనికు లవమానకరముగ నోడుటకుఁ గారణము సమర్థుఁడగు సేనాధిపతి లేకపోవుట యేయని యతఁడు గ్రహించెను. ఈసారి మేవాడ యుద్ధములో సేనలను నడుపుటకుఁ దగిన సేనాధిపతి యెవరాయని తీవ్రముగ నాలోచించుచుండెను. తన కొలువులోనున్న వారిలో మహబత్ ఖానునంటి సేనాని మఱియొకఁడు లేఁడని యతనికిఁ బూర్తిగఁ దెలియును. కాని మహబత్ ఖాను తన జన్మభూమియగు మేవాడుమీఁదికిఁ గత్తి కట్టుట కెంతమాత్రమును సమ్మతించఁ డయ్యెను. అతనికి రాజ

పుత్రులపై ద్వేషముగల్పించి, యేదో విధమున నతనిని మేవాడుపై యుద్ధమునకుఁ బంపి, యీ రాజ్యమును నాతని రణకౌశలముచే నాశనము గావించు టెట్లాయని పాదుషా తలపోయుచుండెను.

అట గజసింహుఁడు నిండుకొలువులో మేవాడుదూతచేఁ బరాభవింపఁబడినవాఁడై యందుకుఁ బ్రతీకారముగాఁ నా రాజ్యమును ధ్వంసముచేసి తన ప్రభువగు జహాంగీరు పాదుషాకు మేవాడు రాజపుత్రులను బాదాక్రాంతులనుగఁ జేయుమార్గంబు నన్వేషించుచు. వికలమానసుండై యా రాత్రియంతయు నిదుర లేక యెట్టులో గడిపి, కడ కొక యుపాయంబు నాలోచించి, వేకువాతనే లేచి, పాదుషా చెంతకు రహస్యముగ బయలు దేరి వెళ్ళెను.

పాదుషా యీ సమయమున నిదేవిషయము నాలోచించు చుండుటచే గజసింహునిరాకయాతనికిఁ గడుంగడు ముదావహ మయ్యెను. గజసింహుఁడు పాదుషాతో "మహా ప్రభూ! మేవాడువిషయమై తామింతగా నాలోచింప నక్కఱలేదు. మహాబత్ ఖా నసమాన ప్రతిభావంతుఁడు. అతని నెవ్విధంబున నైన నొప్పించి మేవాడుపైఁ బంపఁగల్గితిరేని, నాహవంబున మనకు విజయంబు లభించుట నిక్కువంబు." అని పలికినంత నా పాదుషా, "మహారాజా! నీవుచెప్పినది నేనెఱుఁగనిదికాదు. కాని మహాబత్ ఖా నందు కియ్యకొనునా? ఇయ్యకొననిచో నాతని బంపుటెట్లు? అతండును నీవలె నాకొలువులోనున్నను, నొకతెన్నునఁ బోవువాఁడుకాఁడు. స్వతంత్రబుద్ధి కలవాఁడు. బలాత్కరించి పంపినఁ బ్రయోజనమేమి? రాజపుత్రులపై నతనికి ద్వేషానలమురగులుకొలిపి మేవాడుయుద్ధములోనతఁడు

సేనానిగా నుండునటులఁ జేయఁగల దిట్టవు నీవే. అతని సాహాయ్యమున నీవు రాజపుత్రులపై దండెత్తితివేని విజయలక్ష్మి యీ సారి మనలను వరింపకుండునా ?" యని పాదుషా వలుక, నా గజసింహుఁడు ద్విగుణీకృతమైన యుత్సాహముతో నాతని సెలవుఁగైకొని మహాప్రతాపవంతుఁడగు మహాబత్ ఖానుని భవనంబుదెసఁ జనియెను.

## భీ ష్మ ప్ర తి జ్ఞ

అది సౌధప్రాంగణము. రాత్రిసమయము. మహాబత్ ఖానేకాంతమున నొక యాసనముపైఁ గూరుచుండి, "అకటా ! మంగళను నేనేల పరిత్యజించితిని ? భగ్నమనోరథయగు నామె ముద్దుమోము మాటిమాటికి నాకన్నులయెదుటఁ దాండవించుచున్నట్లున్నది. మఱచిపోవలెనని ననుకొన్నను నామె మఱపునకు రాకున్నది. తొందరపాటున నామెను మొదటఁ బరిత్యజించినను బిమ్మట నామె నాకు దీనముగ వ్రాసికొనిన ప్రేమలేఖను నయిత నేల తిరిగిపంపివేసితిని ? ఇట్టి యమూల్యమగు వనితారత్నమును జేతులారఁ బోఁగొట్టుకొనిన నేనెంత యవివేకిని ! నిష్కళంకమును, నిరపేక్షమును నగు నామె ప్రేమనెంత యనుచితముగఁ దిరస్కరించితిని! ఆమె జనకుండగు గోవిందసింహునిపై నాకుఁగల ద్వేషమును బురస్కరించుకొని యామెను నాపత్నిగా గ్రహింపఁజాలనని కఠినమగు సమాధానముఁ బంపితినిగదా ! ఎంత కఠినుఁడను! క్రోధావేశముచే నెంత యకార్య మొనర్చితిని! ఎప్పటికైన నా సాధ్విని గలియు నవకాశము లభించినచో హృదయపూర్వకముగ నామెను క్షమార్పణ వేఁడుకొందును గదా!" యని యెంతయుఁబ్రొద్దు నిద్దురలేక చింతించుచుండె.

అత్తఱి ద్వారపాలకుఁడు ప్రవేశించి, "స్వామీ! యోధపురాధీశులగు గజసింహ మహారాజుగారు తమ దర్శనమునకై వేచియున్నా"రని నివేదించి స్వామి యాజ్ఞవడసి యాయనను లోనికిఁ దోడ్కొనివచ్చెను. మహాబత్ ఖా నాయనను యథోచితముగ సత్కరించి, సవినయముగ నాయనరాకకుఁ గారణం బడిగెను. అంత నాగజసింహుఁడు ప్రసంగవశమున నాతనితో, "మహాశయా! ఇంతవఱకు మేవాడ్ యుద్ధములలోఁ బరాక్రమమున రాజపుత్రులకెందును దీసిపోని ముగలుసైనికులు మాటిమాటికి నోడుటకుఁ గారణము మీకుఁ దెలిసియే యుండనచ్చును. సమర్థుఁడగు సేనానిలేని లోపముఁ బూరించుటకుఁ బాదుషా యద్వితీయ శౌర్యపరాక్రమవంతులగు మిమ్ము నీసారి మేవాడుయుద్ధమున సేనాధిపతిగ నియమింప నిశ్చయించెను. పాదుషాకు నఖండవిజయము సమకూర్ప మీరొక్కరే సమర్థులని వారి దృఢవిశ్వాసము. కావున వారి యాజ్ఞను మన్నించి మీరు మేవాడుపైఁ గత్తికట్టవలె"నని తన యభిమతంబును దెల్పియాతనిని రాఁబోవు ఘోరసంగ్రామమునకై పురికొల్పెను.

అందుకా మహాబత్ ఖాను, "మహారాజా! మేవాడు యుద్ధములలో ముగలు లోడుటకుఁ గారణము సరియగు సేనాధిపతి లేకపోవుటయేయని నేనెఱుంగుదును. నే నాకొఱతను దీర్చి విజయముసాధింపగల్గుదునను నాత్మవిశ్వాసమును నాకుఁగలదు. కాని మేవాడు నా జన్మభూమి. రాణా యమరసింహుఁడు నా సోదరుఁడు. నేను ముగలుల కొలువులోనున్నను, మతమును మార్చుకొన్నను, నా మాతృభూమిపై యుద్ధము చేయుటకు మనసొప్పకున్నది. పవిత్రమగు మేవాడులో జన్మించి, యందలి జలవాయు ప్రభావముచే సుఖముగా వృద్ధినొంది, యామాతృ

దేవీచరణసేవలో నాశరీరము నర్పించుటకు బదులుగా, నామెపై యుద్ధమునకుదిగి సోదర రాజపుత్రులను నాఖడ్గంబునకు బలియిత్తునా? నాశరీరమున నా రాజపుత్రరక్తము ప్రవహించుటలేదా? మీరును రాజపుత్రులయ్యు నన్నీ యన్యాయ్యపుఁ బనికిఁ బురికొల్ప వచ్చునా!" యని గంభీరముగ భాషించె.

అంత నాగజసింహుఁడు "మీరు నొక్కసారి సేనాధిపతిగా గాకపోయినను జుట్టపుచూపుగానైన మేవాడు వెళ్ళిచూడుఁడు. అచటి రాజపుత్రులు మిమ్ముఁగూర్చి యేమేమి చెప్పుకొనుచుందురో తెలిసికొనఁగలరు. పురజనులేకాక, గ్రామవాసులును మీవంక వ్రేలితోఁ జూపించుచు "నితఁడుమహారాణాప్రతాపుని సోదరపుత్రుఁడయ్యు స్వధర్మమును విడనాడి, పరధర్మియుఁడై మ్లేచ్ఛుల పంచఁజేరె"నని హేళన చేయుదురు. "రాజపుత్ర జాతికిఁ గళంకమును దెచ్చిననీచుఁ డితఁడే" యని కాలురు, తరుణులు, వృద్ధులు నింత యేల, స్త్రీలుసైతము మిమ్ము నిందించుచుండు. కాని యెవరును మిమ్ము నాదరించరు. ఇట్లు సాటివారి పరిహాసమునకు, దూషణములకు గుఱియగుట మరణముకంటె దుర్భరము కదా!" యని పలికి యాతనికి నాలోచనను గల్పించెను.

మెండియు గజసింహుఁడు, "సేనానీ! మీ జీవితమంతయు షుగలులతోనే గడుపవలసియుండును. వారి వృద్ధియే మీవృద్ధి; వారి క్షయమే మీక్షయము. స్వామిభక్తి పరాయణులకు మీకింతగాఁ జెప్పవలయునా? తొల్లి కురుక్షేత్రసంగ్రామమునఁ బాండవులదే ధర్మపక్షంబని యెఱింగియు ధర్మవేదులగు భీష్మ

ద్రోణాదులు కౌరవపక్షము నేలయవలంబించిరో యోచింపుఁ" డని యుక్తియుక్తముగఁ బలుకుచు రాజపుత్రుఁడగు మహబత్ ఖానుని మేవాడుపై దాడివెడలుమని ప్రోత్సహించుచుండెను.

ఇవ్విధంబున గజసింహుఁ డాతని మనోనిశ్చయమును మార్పఁ బ్రయత్నించుచుండ నకస్మాత్తుగా మహబత్ ఖాను జనకుండగు నగరసింహుఁడు సన్న్యాసి వేషధారియై యాత్రతో నటకువచ్చి, బిగ్గరగా 'మహబత్' యని తన సుతుని బిలిచెను. అతితీవ్రముగ నాలోచించుచున్న మహబత్ ఖా నులికిపడి, "జనకా! ఏమిది! చిత్తూరుదుర్గమున రాణాగానున్న మీ రీ సన్న్యాసివేషమున నిటకు వచ్చితి రేల?" యని యత్యాశ్చర్యముతో నడిగెను. అందుకు నగరుఁడు, "తనయా! నన్నిచట నీ సన్న్యాసి వేషములోఁ జూడ నీ కాశ్చర్యముకల్గుట సహజమే. కారణముచెప్పెద నాలకింపుము. నేను నీచుఁడనై నిజదేశమును జాతిని, ధర్మమును విస్మరించి, నా జీవితమును వ్యర్థముగావించి తిని. చాలకాలము విజాతీయుల యనుగ్రహము నపేక్షించుచు దాస్యవృత్తికిఁ బాల్పడి రాజభోగముల ననుభవించుటయే నా జీవితమునకుఁ బరమావధియనుకొంటిని. కాని నేఁటికి నాజీవితపు చరమదశలో భగవదనుగ్రహమున నాయపరాధమునుగ్రహింపఁ గల్గితిని. దీనదశలోనున్న నా మాతృదేవియొక్క కరుణాజనక మును మనోహరమును నగు నాహ్వానమును వినఁగలభాగ్యము నాకు లభించినది. కుమారా! యాతల్లిపిలు పెంతగంభీరము నెంత గద్గదమునై యుండునో నీ వూహింపఁగలవా? స్వదేశ మును, స్వజనమును విడనాడి నేఁటివఱకు నే నొనర్చిన పాపము లకుఁ బ్రాయశ్చిత్తముగ నీ సన్న్యాసివేషమును దాల్చితిని. కుమారా! నీవు నాకన్న నెన్నియోమడుంగులుపాపకార్యములఁ

గావించితివి. ఈ పనిం జేసినవానికిని, నింకను జేయుచున్న వానికిని నిప్పటికైనం బ్రాయశ్చిత్తముం జేసికొమ్మని యుపదేశించుటకే నేనిచటికి వచ్చితి"నని యావేదనాపూర్వకముగం బలికెను.

తండ్రిమాటల నోపికతో వినుచున్న మహాబత్ ఖానాశ్చర్యముతో, "ఏమీ! నాపాపములకా జనకా!"యని యడిగెను.

అనవుండా సగరుండు, "అవును. నీపాపములకే. నేను స్వజనమును వీడి మొగలులకు దాసుండనై జీవించుచుంటిని. కాని మతమునుమాత్రము మార్చుకొనలేదు. నీవు నన్నుమించితివి. నీవు నీమతమునుగూడవిడిచి యిస్లాముమతమును స్వీకరించితివి. నీపాపమునకు మితియున్నదా?" యని పలికెను. అందు కా మహాబత్ ఖాన్డు, "నేంజేసిన పాపమేమో నాకుం దెలియుట లేదు. ఇస్లాముధర్మము సత్యమైనదని విశ్వసించుట—" యని యేమో యతండు చెప్పంబోవుచుండం దన యుద్రేకము నణంచుకొనలేక, యాతనిమాట కడ్డమువచ్చి, సగరుండు, "పుత్రా! నీకు నిస్లాముమతమందు విశ్వాసము కల్గుటకుం గారణము ఖురానును శ్రద్ధగం జదువుటయేకద! అది నిశ్చయముగ నుత్తమగ్రంథములలో నొకటియ. దానిని హిందూధర్మ మెన్నండును నిందింపదు. ఆగ్రంథములో దీనికెన్నండును వివాదమే లేదు. కాని నీవు నీపూర్వు లనుసరించినదియు, వ్యాసుండు, కపిలుండు, శంకరాచార్యులు మున్నగు మహాపురుషులు ప్రతిష్ఠించి, యాచరించిన హిందూధర్మముం బరిత్యజించుటకుం బూర్వము వారి గ్రంథములలో నొక్కటియైన ఖురానును జదివినంత శ్రద్ధగాం జదివితివా? నీవంటి మూర్ఖునకు, నిరక్షరాస్యునకు ధర్మాధర్మ విచక్షణ సాధ్యమగునా? ప్రవృత్తి

దమనమును, నాత్మవిజయమును హిందూధర్మమునకు మూల మంత్రములు. సర్వభూతములందును దయగల్గి యుండుటయు, మనుజులనే కాక క్షుద్రములగు కీటకములనుగూడ హింసింప కుండుటయు హిందువులకుఁ బరమధర్మములు. అట్టి విశ్వప్రేమను బోధించు హిందూధర్మమును సంపూర్ణముగఁ దెలిసికొనక యే విడిచిపెట్టితివి ! నీ వెంత పాపకర్ముఁడవో నీ వెఱుఁగవుకదా !" యని దీనముగాఁ బలికెను.

అంత నా మహబత్ ఖాను, "తండ్రీ ! నేఁడు మీ వేష భాషలుచూడ నాకు నాశ్చర్యజనకములుగ నున్నవి. ఈనాఁడు మీలో——" అని యేదియో చెప్పఁబోవుచుండ, నాతనిమాట కడ్డువచ్చి యాసగరుఁడు, "నేఁడు నీకిట్లు ధర్మోపదేశము చేయఁ గల్గుదునని నేనెన్నఁడును దలఁచలేదు. ప్రస్తుతము నాలో వచ్చిన మార్పుచూడ నాకే యాశ్చర్య మగుచున్నది. ఇంత వఱకుఁ బ్రపంచములో నెట్టి నైచ్యమునకైనఁ బాల్పడి ధన మార్జించుటయే జీవితమునకుఁ బరమావధియని నమ్మి జీవిత మును వ్యర్థముగాఁ గడిపిన నేనీనాఁడు సన్యాసినగుట యాశ్చర్య కరముకాదా! కాని సర్వాంతర్యామియగు నాపరమాత్మ ప్రతి మానవుని హృదయ కుహరమునందును వ్యవస్థితుఁడైయున్న కారణమున దుష్టుని హృదయమునఁగూడ నుచ్చప్రవృత్తులు ప్రసుప్తములై యుండును. సువిమర్శకుఁడగు సద్గురువు వానిని బ్రబోధించినంతనే యవి సువ్యక్తములగును. అప్పు డాతఁడు బ్రహ్మానందము ననుభవించును. క్షుద్రస్వార్థమను పెనుభూతము తొలఁగినంతనే యాత్మ సాక్షాత్కారమగును. చీఁకటియును వెలుతురును నొక్కచో నుండ నేరవు కదా ! అహంకార రహితుని హృదయ మెంత నిర్మలముగ నుండును ! పుత్రా !

ఈ తత్త్వజ్ఞానమును నాకుఁ బ్రసాదించినది నీ భార్యయగు మంగళయేసుమా! ఆమె యుపదేశవాక్యము లిప్పటికిని నా చెవులలోఁ బ్రతిధ్వనించుచున్నయవి" యని యాతనికి నచ్చెరువు గొలుపఁ బలికి, యంతటితో నూరకుండక విధిప్రేరితుండై, "మహాబత్! గోవిందసింహుఁడు మంగళను దనయింటినుండి వెడలఁగొట్టెనని నీ వెఱుఁగుదువా?" యని ప్రశ్నించెను.

ఆమాట విన్నంతనే మహాబత్ ఖాను కలవరపడి, "ఏమీ? గోవిందసింహుఁడు మంగళ నింటినుండి బహిష్కరించెనా! ఏల? ఆమెచేసిన నేరమేమి?" యని యాతనితో నడిగెను. అందుకా సగరుఁడు, "ఆమెనాథుండు మతాంతరుఁడైనను నేఁటివఱకు నాతనిని బూజించుటయే యామె యపరాధము. ఆ కారణము ననే తండ్రి యామె నింటినుండి వెడలఁగొట్టెను. ఒకగ్రామము సమీపమున నున్న యొక జీర్ణకుటీరమున నామెనుగాంచి, యీ విషయముల నామెవలనఁ దెలిసికొంటి" నని బదులు చెప్పెను.

అంత నామహాబత్ ఖానుఁ డుగ్రుఁడై "ఔరా! ఆ మతాంతరుఁడను నేనే గదా! నా యందలి క్రోధముచే గోవిందసింహుఁ డెంత పనిచేసెను! నన్ను నారాధించుచున్నదను కారణమునఁ దన సుతను వెడలఁగొట్టెనా? ఆమెపతిభక్తి కిదియాఫలితము! నాన్నగారూ! మీ హిందూధర్మమునకుఁ గల యుదారత, సహనము లివియేగదా! మీహిందువులకు మసల్మానులపై నింత ద్వేషమా! ఇంత జాతిమత్సరమా! ఇంత దురహంకారమా! తండ్రీ నా పాపములకు నన్నుఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొమ్మంటిరి. తప్పక చేసికొందును. కాని యెందులకు? మీ హిందూమతమును విడిచి ముసల్మానునైనందుకుఁగాదు. ఇటి

దురహంకారపూరితమగు హిందూజాతిలోఁ జన్మించి కొంత కాలమువఱకు హిందువుఁడనుగా నున్నందుకుఁ బ్రాయశ్చిత్తము. తండ్రీ ! ఇంతవఱకు నాకు హిందువులయెడఁగల దయాలేశమును నేఁడు కూఁకటివేళ్ళతోఁ బెకలించుచున్నాను. ఈనాఁటినుండి నా నరనరములలోను నుదారమగు నిస్లాము తత్త్వమును బ్రవేశపెట్టుకొంటి'' నని పలికెను.

సగరుఁడేమో చెప్పఁబోవుచుండ మహాబత్ ఖా నాతని నోరెత్తనీయక, తన యావేశము నాపుకొనలేక, ''జనకా ! నేను మితభాషిని. ఒక్కసారి యేదేని ప్రతిజ్ఞ చేసిన నది యెంత భీషణమైనను దానిని నిర్వహింతునని మీ రెఱుఁగుదురు. మీ యుక్తులు,మీయుపదేశములు,మీయాదేశములు నాముందఱఁ బనికిరావు. ఇఁక దయచేయుఁ''డని కఠినముగఁ బలికి లోనికిఁ బోఁబోవుచుండ సగరుఁడు తన యుద్రేకము నణఁచుకొనలేక, ''మహాబత్ ! నీ వింతకన్న నధోగతిపాలు కాకున్న నెవరు తప్పించఁగలరు ? పొమ్ము. నరకమునఁ బడి నీ పాపములకు ఫలము ననుభవింపుము. మ్లేచ్ఛుఁడా ! మతభ్రష్టుఁడా ! దేశద్రోహీ ! కులఘాతుకుఁడా ! నశించుము'' అని కుమారుని దూషించుచు సగరుఁ డా భవనమునుండి బయటికి దుమికి, రాజమార్గములఁ బడి పిచ్చివానివలెఁ బరుగువెట్టుచుండెను.

అటుల సగరుఁడు వెడలిపోయినపిదప మహాబత్ ఖానాకసము వంకఁ జూచుచు నుద్రిక్తమానసుండై తనలోఁ దా నిట్లు తల పోయఁ జొచ్చెను. "ఎంత ద్వేషము ! ఎంత మాత్సర్యము ! ఇట్టి హిందూజాతి ముసల్మానులచే నధికముగ ద్వేషింపఁబడుచు నవమానింపఁబడుచున్న నందాశ్చర్య మేమున్నది ? ఒకవనిత

తనపతి నారాధించుచున్నందుకు జాతినుండి బహిష్కరణమా! పతిభక్తి సతికి విహితముకాదా! ఇది నేరమా! ఆహా! సనాతన హిందూధర్మ మెంత యుదారమైనది! ఎంత మహత్తరమైనది! ముసల్మాను మతమన్ననో యే మతావలంబులనైనను సహర్షముగాఁ దనలోఁ జేర్చుకొనును. ఇది యుదారతకాదా! అన్యమతస్థుఁడు తలక్రిందుగఁ దపమాచరించినను హైందవుఁడు కాలేఁడుగదా! హిందువుల కెంతగర్వము! ఎంత యహంకారము! ఎంత విరోధభావము! వీరికిఁగల జాతిమత్సరమును జూర్ణము గావించుదునుగాక!"

మహాబత్ ఖానుని యీ ఘోరనిర్ణయము గజసింహునకు నాశ్చర్యమును నానందమును గల్గించెను. అతఁడు (మహాబత్ ఖాను) గజసింహునితో, "మహారాజా! నేనీసారి మేవాడుపై దండెత్త నిర్ణయించితినని పాదుషాకుఁ దెలియఁ జేయుఁడు. ఇందాశ్చర్యమేమియు లేదు. నేను మేవాడుపై దాడివెడలుట జహాంగీరు నాజ్ఞను మన్నించికాదు. హిందూధర్మమును, హిందూజాతిని సమూలముగ ధ్వంసముచేయుట కని గ్రహింపుఁడు. ఇంతకాఠిన్యమును బరులపైఁ జూపు హిందూమతము నకుఁ బ్రపంచమున నామరూపములైన నుండఁజనవు. ఈసారి లక్షలకొలఁది మొగల్ సైనికులకు సేనాధిపతినై మేవాడును సర్వనాశ మొనర్తును. ఈనా యంతిమ నిర్ణయమును మీరు వెంటనే పాదుషా కెఱింగింపుఁ"డని పలికెను. అంత గజసింహుఁడు తన పన్నాగ మప్రయత్నముగ ఫలించినందుకు నంతరంగమున సంతసించుచు ఖానుని సెలవుఁబడసి వెడలిపోయెను.

# సగరుని మరణము

ఒకనాఁటి యుదయమున జహంగీరు పాదుషా కొలువుదీరి యుండెను. పర్వేజ్ నాయకత్వమునఁ గూడ తనసేన లోడి నందుకు మిగుల చింతాగ్రస్త మానసుండయ్యె, నబ్దుల్లా ధైర్య సాహసములతో యుద్ధముచేసితుదకుఁ బ్రాణములర్పించినందుకుఁ బాదుషా యతని త్యాగము నెంతయో ప్రశంసించెను. హిదాయతుఅలీ యుద్ధమున బందిగాఁ గొంపోఁబడి రాణా యనుగ్రహమున నెట్టులో విడుదలనొంది యవమానకరముగ మరలివచ్చినందు కాతని భీరుత్వమును గర్హించెను.

అట్టియెడ మహాబత్ ప్రాసాదమునువీడి ఢిల్లీపుర రాజవీధుల వెంట నున్మాదునివలెఁ బరుగులెత్తుచున్న సగరు నా సన్యాసి వేషమున నెవ్వరును గుఱుతింపఁజాలరైరి. ఇట్లాతఁడు వాయు వేగమునఁ బోయి యెట్టులో యేరికిఁగానరాక కోటద్వారముల దాఁటి యుద్ధవిషయములఁ జర్చించుచున్న పాదుషా దర్బారును బ్రవేశించి యాతని సమీపమున నిలిచెను. సభ్యులెల్లఱు నాతని వంక నాశ్చర్యముతోఁ జూచుచుండిరి.

పాదుషా యాతనిఁగాంచి ససంభ్రమముగ, "రాజా! మేము మిమ్ము మేవాడుకు రాణాగాఁజేసి చిత్తూరునకుఁబంపితిమిగదా! మీరిక్కడి కేలవచ్చితిరి? పైగాఁ జిత్తూరుదుర్గమును మీరు మరల రాణాయమరసింహున కొప్పగించితిరఁట. ఎవరియాజ్ఞచే నట్లొనర్చితిరి?" అని అడిగెను.

సగరుఁడు "యవనచక్రవర్తీ! న్యాయమువిచారించినఁజిత్తూరు కోట రాణా యమరసింహునిదేకదా! ఆనాఁడగ్బరుపాదుషా జయమల్లుని మోసగించి, చంపించెనఁట. అంతియకాని ధర్మ

యుద్ధముచేసి చిత్తూరును వశపఱచుకొనలేదని వింటిని. కావున రాజపుత్రుఁడగు జయమల్లుని కోటను రాణా యమరసింహున కిచ్చుటకు నా కెవరి యనుమతి కావలెను?'' అని ధైర్యముగాఁ బలికెను.

జహంగీరు "రాజా! ఇట్లు ధర్మనిర్ణయముచేయు యోగ్యత నెప్పుడు సంపాదించితి''రని కోపము నడఁచుకొని యాశ్చర్యముతోఁ బ్రశ్నించెను. అందుకు సగరుఁడు, "పాదుషా! కలుషభూయిష్ఠమైన నా జీవితములో నొకనాఁడు పూర్వపుణ్య ఫలితముగ నొక దివ్యజ్యోతిని గాంచితిని. దాని ముందు నా యజ్ఞానాంధకార మంతయుఁ బటాపంచ లయ్యెను. మా పూర్వపురుషుఁడగు శ్రీరామచంద్రుని కాలమునుండి నేఁటివఱకును జరిగిన యుదంతములను, నా మహాపురుషుల రూపములను నా మనోవీధిని గాంచితిని. బాప్పారావల్ విజయగాథలును, స్వదేశరక్షణకై సగరసింహుఁడును, చూడా సింహుఁడును జేసిన జీవన త్యాగములును, మహాసంగ్రామములలో కుంభుఁడు ప్రదర్శించిన శౌర్య పరాక్రమములును, నింక నెన్నియో స్ఫూర్తిదాయకములగు నద్భుత దృశ్యములు చలనచిత్రములువోలె నా కన్నుల యెదుట భ్రమించెను. ఇంతలో నాకస్మికముగా నా ముందు వ్యాపించిన పొగమంచులోనుండి నా సోదరుఁడగు ప్రతాపుని భీకరకరవాలము ప్రత్యక్షమయ్యెను. దానిని దర్శించినంతనే నాలో నొక యనిర్వాచ్యమగు సంచలనము కలిగెను. నేనుఁగూడ నా పవిత్రమగు రాజపుత్ర వంశమునకుఁ జెందినవాఁడనయ్యు, జాతివిరోధులపక్షమవలంబించి, వారికి దాసానుదాసుఁడనై జీవితమును వ్యర్థముగాఁ గడిపినందుకు నెంతయుఁ

జింతించుచు, మరల నప్పుడప్పుడు నా నీచప్రవర్తనను సమర్థించుకొనుచు నుంటిని.'' అని పలుకుచు నాగెను.

పాదుషా, ఈ వృత్తాంతమును నోపికతో వినుచు 'రాజా! ఇది యంతయు మీా చిత్రభ్రమవలెఁ దోఁచుచున్నది. అటు తరువాత నేమయ్యె?'నని యడిగెను.

వెండియు నా సగరుఁడు, ''సమ్రాట్! యింతదనుకఁ దాము విన్న విషయములు పుక్కిడిపురాణములవలెను, నూహాప్రపంచములోని కల్పితవార్తలవలెను దమకుఁ దోఁచవచ్చును. ఇఁకఁ జెప్పఁబోవునది పౌరాణికము కాని, పూర్వచారిత్రకము కాని కాదు. ప్రత్యక్షముగా నిటీవల జరిగినదే. నేను దేశవైరులకు బానిసనై, దేశమును శత్రువులపాలుగావింప యత్నించుచుండ నా• యనుంగుపట్టి సంసారసుఖములఁ బరిత్యజించి చినిఁగిపోయిన కాషాయాంబరములదాల్చి చారణియై యా దేశదాస్యవిమోచనము కొఱకే యెన్నిమో యిడుములఁ గుడుచుచు, మేవాడులోని పట్టణములలోను, బల్లెలలోను, దుర్గమములగు పర్వతములలోను, నరణ్యములలోను సంచరించుచు, దేశభక్తిపూరితములగు గీతములఁ బాడుచు నొకనాఁడు నా కంటఁ బడియెను. ఆమెను గాంచినంతనే శోకపారవశ్యతను గన్నీరు మున్నీరై పాఱెను. కంఠస్వరము స్తంభించెను. దైవయోగమున నొక్కమారుగా లజ్జ, భయము, భక్తి, ప్రేమభావము లుదయించి, నా హృదయమును గలఁచివైచెను. దీనికిఁదోడు నా కోడలు మంగళయు నాకు తత్వజ్ఞాన ముపదేశించె. ఇఁక నొకనిముసమైనఁ జిత్తూరుకోటలోనుండజాలక నా తమ్ముని కుమారుఁడగు రాణా యమరసింహునకు నాకోటనిచ్చివేసి యిటకువచ్చితి'నని

నుడివెను. అంతట బాదుషా, "రాజాజీ! మీరు మరణించుటకు సిద్ధపడియే యిచటికే తెంచితిరా?" యని ప్రశ్నించెను.

అప్పుడా సగరుడు, "యవనసామ్రాట్! ఈవఱకు మరణమనిన నాకు భయమగుచుండెడిది. ఇప్పుడు నాకు మృత్యుభీతియే లేదు. చచ్చుటకు బూర్తిగ సిద్ధపడియే యిచటకు వచ్చితిని. ఇంతదనుక స్వార్థపూర్ణమును, దుచ్ఛమును నగు భోగరాజ్యమున నుంటిని. అదియే నరకము. దానికి ప్రభువు సైతాను. చిత్తూరులో నాకుగల్గిన యనుభవముల ఫలితముగ నేనొక నూతనరాజ్యమున బ్రవేశించితిని. అదియే స్వర్గము. దానికి బరమేశ్వరుడు లేక యల్లా ప్రభువు. అది స్వార్థరహితమును నుత్కృష్టమును నగు త్యాగరాజ్యము. ఈరాజ్యమునకు మంత్రులు గౌతమబుద్ధుడు, యేసుక్రీస్తు, మహమ్మదు, చైతన్యుడు. ఇచట భక్తి, ప్రేమ, దయయు ముఖ్యనియమములు. సేవయే యిచట బరమధర్మము. దీనికి బ్రతిఫలాపేక్షయే లేదు. ఇట్టి పరమపవిత్రమగు త్యాగరాజ్యమున బౌరుడ నైనంతనే నాదృక్పథము మాఱిపోయెను. ఆనాటినుండి నేను దీనసంరక్షణార్థమై యార్తత్రాణ పరాయణుండనై యాయుధమును ధరింప నేర్చితిని. వైరుల ఖడ్గప్రహారములు నాకు బుష్పహారముల వలె భాసించుచున్నవి. నా పురాకృత పాపములకు బరిహారము మృత్యువుకన్న వేఱొండు లేదని నిశ్చయించుకొని, చిత్తూరునువిడిచి యిచటికి వచ్చితిని. ప్రేమపూర్ణమగు నంతఃకరణముతో స్వార్థత్యాగము చేయనేర్చిన వానికి మరణభీతియుండునా?" యని వచింప, నా యవనచక్రవర్తి, "రాజా! మంచిది. అట్లేకానిమ్ము. మరణమునకు సిద్ధపడుము" అనిపలికి యొక ప్రతీహారిని బిలిచెను. అంత సగరుడు,

"మొగల్ సామ్రాట్, యీ భాగ్యమునకు, నీ వృద్ధుని వధించుటకై యొక హంతకుఁడుకూడ రానలయునా?" యని వచించి, తన నడుమునబంధించిన కృపాణంబును దూసి, తనవక్షంబునఁ బొడుచుకొని, యచటనే క్రిందఁబడి, వడివడిగఁ దన శరీరము నుండి ప్రవహించుచున్న రక్తమును జూచి, "పాదుషా! నా పాతకముల నన్నిఁటిని నీ రుధిరప్రవాహమునఁ గడిగివేయు చుంటి"నని పలికి పుడమిపై విశ్రమించెను.

## జాతి ద్రోహము

ఉదయసాగర తీరమునకు సమీపమునఁ గొందఱు మోహ నాంగులు పండువెన్నెలలో హోలీపండుగ సందర్భమున నృత్య గానంబుల సల్పుచు, జయదేవకృతంబగు నొక గీతముఁ బాడిరి. "శ్రీకృష్ణుని మురళీనాదము వినఁగనే గోపికలు వ్యాకులిత మానసలై తమయిండ్లనువీడి శరీరమునుమఱచి వనమునకుఁబరు గిడసాగిరి. జగన్మోహనమగు నామురళీగానప్రభావమునఁ గ్రూర జంతువులు సయితము తమ క్రూరత్వమును విస్మరించి సాధు మృగంబులచెంతనే నిరపాయకరముగ నిల్చియుండె. తరుకుంజ ములపైఁ గోవెలలు మధురముగఁ గూయసాగె. పూల మొగ్గలు వికసించెను. తుమ్మెద లందలి మకరందము గ్రోలు చుండెను. పిల్లవాయువులు వీచుచుండెను. చంద్రకిరణములు యమునానదిలోఁ బ్రతిబింబించు చుండెను. పశుపక్ష్యాదులనే యీ శ్యామసుందరుని గానము మోహింపఁ జేయుచుండ నా వ్రజనారుల ముగ్ధలనుగఁ జేయుటలో నాశ్చర్య మేమున్నది? ఆ గానము విని రాధ శ్రీకృష్ణునికొఱకై వెదకుచున్నది" యను

భావముగల గీతమును బాడుచు, నా కోమలాంగులు మైమఱచి యుండిరి.

రాణా యమరసింహుఁడా కాసారతీరమున నొక వేదికపైఁ గూరుచుండి యచటి ప్రకృతి సౌందర్యముఁ గాంచి యానందించుచు, నా స్త్రీలపారవశ్యమున కాశ్చర్యపడి, "అసారంబగు నీ సంసారము మానవుల నెంత భ్రమింపఁ జేయును! పరమేశ్వరుని మాయాశక్తి వారిని గాయంబను చెఱసాలలోఁ బడవైచి, దుఃఖంబొందకుండ, హేయంబులౌ విషయేచ్ఛలం జొనిపి యందేమో సుఖంబున్నదంచు భ్రమపెట్టి నిరతం బూగాడఁ జేయుంగదా! మానవుఁడు తత్వవిచారణచేసి యమరత్వము నొందఁ బ్రయత్నించునపు డిది యెన్ని ప్రతిబంధకములఁ గల్పించును! ఈ ప్రకృతిలో నతనికి నీశ్వరసాక్షాత్కారము కలుగకుండున ట్లీ సంసారము మానవులను బలాత్కారముగ సుఖదుఃఖముల వైపు లాగివేయును. ఈ మాయామయంబగు జగంబును నేనేల పరిత్యజింపరాదు?" అని తలపోయుచుండె.

ఇంతలో మానవతి ప్రవేశించి, "జనకా! యీచలిగాలిలో నేమిచేయుచుంటిరి? ప్రాసాదములోనికిఁ బోవుదము రం"డని పిలువ, నా రాణా తనకుఁ బ్రపంచముపైఁ గలిగిన విరక్తి భావమును వెలిబుచ్చెను. అందుకా మానవతి "ఈశ్వరుఁడు ప్రకృతితో నే కూడియున్నందున, నది యెంతో మనోహరముగ నుండును. దయాస్వరూపుఁడగుటం జేసి యతఁడు సృష్టిలో మన కెన్నియో సౌకర్యములఁ గల్పించెను. దివారాత్రములను, సాయంప్రాతములను, శిశిరవసంతాది ఋతువులను సృజించి, చక్రనేమిక్రమమున సుఖదుఃఖముల నొకటి వెనుక నొకటి

వచ్చునట్లు చేసి, మనల నెన్నియోవిధముల నిరంతర వాత్సల్యముతో రక్షించుచుండును. ఆ పరమేశ్వరుఁడు సమస్తచరాచర ప్రపంచమందును నిండి నిబిడీకృతుఁడై యున్నందున, జనకాది రాజర్షులు జ్ఞానమార్గాన్వేషణకై యీ జగంబును బరిత్యజింపక, లోకసంగ్రహణార్థమై యిందేయుండి నిష్కామకర్మను జేసి జీవన్ముక్తులై"రని రాణాకుఁ దత్వము నుపదేశించెను.

కాని రాణా యంతటితో సంతుష్టినొందక, "కుమారీ! నీవు చెప్పినదంతయు సత్యమేకాని ప్రస్తుతము మానవజాతిలో నా సామరస్యము లోపించినట్లగపడుచున్నది. మానవుఁడు నాటి వాని సుఖలేశమునుజూచి యోర్వలేకున్నాఁడు. కామక్రోధాది శత్రువు లార్గురును బ్రతిజీవిలోను బ్రవేశించి చోరులవలె జ్ఞాన రత్నము నపహరింపఁ జూచుచున్నా"రని నిరాశతోఁ బలికెను.

అందుకు మానవతి, "అరిషడ్వర్గంబునకులోనై సంసారాబ్ధిని దరించలేక, పరితపించు మానవజాతిపై దయఁదలఁచి వారి కు త్తీర్ణులనుగఁ జేయఁగల్గిన కుశలకర్ణధారులు కావలయును. దీన మానవుల దుఃఖములను బాపి, వారి నుద్ధరించుటలోనే వాస్తవికానందము కలదు. కావున సంసారం బసారంబనియెంచి దానిని పరిత్యజింపఁ జనునా? దుఃఖభూయిష్ఠమగు నీసంసార సాగరంబుఁ దాను దరించి, యితరులను దరింపజేయువాఁడే ధన్యజీవి" యని యుక్తియుక్తముగాఁ బలికెను.

అంత నా రాణా, "బిడ్డా! నాకంటె నీవు వయసునఁ జిన్న దానవయ్యు నెస్సగాఁ బలికితివి. కాని యీ సమయమున నా చిత్తమేలొకో భ్రమించుచున్నట్లున్నది. ఏమియుఁదోఁచుటలే"దని పలికెను. అందుకుఁ మానవతి, "తండ్రీ! చీఁకటిపడుచున్నది.

లోనికిఁ బోవుదము రండు. కొంత మనశ్శాంతి కలుగు"నని చెప్పి ప్రాసాదములోనికిఁ బోయెను.

కాని రాణా యచటనే కూరుచుండ, నందలి మనోహరము లగు మందమారుతములును, నిర్మలాకాశమును, నుదయసాగర మందలి తరంగముల మధురగానంబును, నా తరంగములలో నుయ్యాలలూఁగు చంద్రకిరణంబులును, బవనములతోఁ గ్రీడించు చున్న భూరుహశాఖలును నాతనికిఁ గొంత మనశ్శాంతి నొసంగెను.

అత్తఱి రాణి ప్రవేశించి, "మహారాజా! యీ కాలపు పిల్లలు పెద్దలు చెప్పిన మాట వినుటలేదు. చూడలేదా! ఆనాఁడు గోవిందసింహుని పుత్రికయుఁ బుత్రుండును మాట పట్టింపుమీఁదఁ దండ్రి నిలువిడిచి వెళ్ళిరి. మనకాలములో నిట్టివి యెఱుఁగము. ఈ కాలపుఁ బిల్లల తీరింతియకాఁబోలు! కనుకనే మన పిల్ల పెళ్ళి వెంటనే చేయవలెను. కానిచో నిఁక ముందగుట యసంభవ"మని పలికె.

అందులకు రాణా, "మానవతి పెండిలియగునట్లు కన్పించ లేదు. పెండ్లికొఱకై జన్మించిన పిల్లవలె నగుపడుటలే"దని బదులు చెప్పెను.

అంత రాణి, "అట్లనకుఁడు. యోధపురికి దూతగా వెళ్ళిన యరుణసింహుఁడు ముహూర్త నిర్ణయముఁ జేసికొని వచ్చెనా?" యని యాత్రముతో నడిగెను.

రాణా :- దూత తిరిగి వచ్చెను. కాని యోధపుర రాజు మనతో వియ్యమొందుట కియ్యకొనక పోఁగాఁ గయ్యమునకుఁ గాలు

దుష్ప్రచున్నవాఁడు. దీనికిఁ గారణము మనము యుద్ధమున గెల్చుట, ముగలు లోఁడుట.

రాణి :- నే ననుకొనినదంతయు నైనది. ఈ వికటపరిస్థితిలో వివాహ మెట్లగును?

రాణా :- వివాహవిషయ మటుంచుము. గజసింహ మహారాజాగ్రా వెళ్ళి పాదుషాతో మనపైఁ గొండెములు చెప్పి, మేవాడుపై దాడి వెడలుట కొరకు పెద్ద సేనను బంపునఁట. ఈ సారి మన రాజ్యము సర్వనాశనమగును. ఏమియు మిగులదు.

రాణి :- కనుక నే మార్వాడుపై యుద్ధము చేసియైన వివాహ ప్రయత్నముఁ గొనసాగింప వలయును.

రాణా :- ఎంత వెఱ్ఱిదానవు! యోధపురరాజు ముగలుల నాశ్రయించుటచే వారి సాహాయ్య మాతనికి లభించును. మనము కేవలము స్వశక్తిపై నాధారపడియుంటిమి. అదియును క్రమముగఁ క్షీణించుచున్నది. ఇపుడు మనమేమి చేయఁగలము? కానున్నది కాకమానదు. మనము భయపడనేల? ఇది సంపూర్ణ నాశనమునకే వచ్చినది. జాతిలో నిట్టి క్షుద్రభావము లుదయించినపుడు పరమేశ్వరుఁడును దానిని రక్షింపఁజాలఁడు.

రాణి :- పరమేశ్వరుఁడు మనవంటి నిరపరాధుల రక్షించుట కవతరింపఁడా?

రాణా :- మనము సాధువులమా? గజసింహుఁడు రాజపుత్రుఁడే కద! మనపై నాతని కింత యకారణ వైరమేల? మన మాతని కేమియెగ్గు సేసితిమి? తక్కిన రాజపుత్ర రాజ్య

ములవలె మనము ఢిల్లీపాదుషాలకుఁ దలయొగ్గక, స్వాతం
త్ర్యమునకై పోరుచు, సర్వమును గోల్పోవుచుంటిమి. ఇది
యాతనికిఁ గష్టమేల కలిగించవలె? అతఁడు మనపక్షమున
యుద్ధముచేయకపోఁగా శత్రుపక్షమునఁ జేరి వారిసేనలతోఁ
బాటుగ సాటివారమైన మనపై దాడి వెడలుటయా?
ఇంతకన్న దుష్కార్యము కలదా? ఇట్టివారు మనలో
నున్నపుడు భగవంతుఁ డవతరించునా? ఒకవేళ నవతరించిన
నెందుల కవతరించును? మన జాతిని రక్షించుటకుఁగాదు.
క్షుద్రస్వార్థముతోఁ గూడిన యీ జాతిని సంహరించుటకని
నమ్మెదను.

రాణి:- అతని దోషమువలన మనమును నశించవలసిన దేనా?

రాణా:- అతఁడును మనమును నొక్కజాతివారము. పడవలో
నున్న వారిలో నొకఁడు పొరపాటుచేసినఁ దక్కినవార
లందఱు మునిఁగిపోవలసిన దే కద! దీని నెవరు తప్పించఁ
గలరు? అని వారిద్దరు సంభాషించిన పిదప లోనికిఁ బోయిరి.

ఆనాఁడు మానసవతి యేలొకో మిగులఁ గలతఁ జెంది
యుండెను. ఆమె యజయుని దలఁచుకొని యిట్లు చింతిలఁదొడఁ
గెను. "విదేశములకుఁ బోవుటకుముందు నన్నుఁ గలియక యే
వెడలిపోతివా? ఒక్క త్తరము నైన వ్రాయకపోతివి? అజయా!
ఎంత కఠినుఁడవు! నీకొఱకై యిప్పుడు దుఃఖించినఁ బ్రయో
జన మేమి? నిన్నెన్నఁటికైనఁ జూడఁగల్గుదునా? నీవులేని జగంబు
నాకు శూన్యముగఁ దోఁచుచున్నది. మనం బేలొకో కలవర
మందుచున్నది!" యని పరిపరివిధముల నామె పరితపించు
చుండెను.

# క్రూర నిర్ణయము

మహాబత్ ఖాను మేవాడు సమీపమున నొక పెద్దడేరాలో విడిసియుండెను. అతఁడు చెంతనున్న పర్వేజుతో, "మీరిఁక నాలసింపక యొక లక్షసైన్యమును గైకొని చిత్తూరుదుర్గము నాక్రమించుఁ" డని యాజ్ఞయిచ్చెను. పర్వేజాతని యాజ్ఞాను సార మాదుర్గము నాక్రమించుటకు వెడలిపోయెను. అనంతరము మహాబత్ ఖాను సమీపవర్తియగు గజసింహునితో, "గజసింహ మహారాజా! మేవాడు గ్రామముల నన్నింటిని నొకమూలనుండి మొదలు చేసికొని పూర్తిగాఁ దగులఁబెట్టించుఁడు. ఆ పనిలో నెవ్వఁడేని మిమ్ము నడ్డగించినచో నాతని నిర్దాక్షిణ్యముగ వధింపుఁడు. ఈకార్యమును నెఱవేర్చుటలో మీకన్న సమర్థులు వేఱలేరని నేనెఱుంగుదును. కాని స్త్రీలపై నెట్టియత్యాచార మును జరుగకుండ బహుజాగరూకులై యుండవలయు"న నెను.

అందుకు గజసింహుఁడు, "చిత్తము. మేవాడురాజ్యములో నొక రాజపుత్రునైనఁ బ్రాణములతో వదలిపెట్టను. అందలి గృహముల నన్నిఁటిని భస్మీభూతము గావింతును. నాసామర్థ్య మును మీరే గ్రహింపఁగల"రని గర్వముతోఁ బలికెను.

మహాబత్ ఖాను, "మహారాజా! మీ యోగ్యతను నే నెఱుఁగకపోలేదు. రాజపుత్రులకు వారి సోదర రాజపుత్రులపై నున్నంత యీర్ష్యాద్వేషములు నన్యమతావలంబకులగు ముస ల్మానులకుఁగూడలేవు. హిందువులకుఁ దమ సోదరులను హింసిం చుట యందును, వారిపై నత్యాచారములుజరుపుటయందును గల్గు సంతోషము వారికి మఱియొక పనియందుఁ గానరాదు.

దీనికి నితిహాసమే సాక్షి. రాజపుత్రులను సర్వనాశన మొనర్చుటలో మీకుఁగల నైపుణ్యము, నుత్సాహము మరెవ్వరికిని లేదు. కావుననే యీ పనిని మీ కొప్పగించిరి. మీరు త్వరగాఁబోయి మీ పనిని ప్రారంభింపుఁడు. మతోన్మాదులగు రాజపుత్రుల గృహములు దహించుచుండ నేను జూడవలయును. వారి హాహాకారముల వినవలయును. అప్పటికిఁగాని నా హృదయము శమింపదు. పొం"డని యానతిచ్చెను. గజసింహుఁడును నాతని సెలవంది వెడలిపోయెను.

మంగళ, మతాంతరుఁ డగు దనపతిని ప్రేమించినందుకు గోవిందసింహుఁ డామెను బహిష్కరించెనను వార్తవిన్న నాఁట గోలె మహబత్ ఖానునకు మనశ్శాంతి లేదు. జాగ్రత్స్వప్నావస్థలయందును' హిందూజాతిని, హిందూధర్మమును నెట్లు ధ్వంసము చేయుదునా యను నొక్క యాలోచనయే యతని మనసున మెదలుచుండెను. ఎప్పుడును నతఁడు, "హిందువులారా! రాజపుత్రులారా! మేవాడ్ భూమీ! జాగ్రత్త! ఇది జాతికి జాతికిఁ గాదు, మతమునకు మతమునకు యుద్ధము. ఇందులో నే మతము గెల్చునో చూడవలయు" నని హెచ్చరించుచుండెను.

## అంతిమ ప్రయత్నము

మిగిలిన రాజపుత్రరాజ్యము లన్నియు పరాధీనము లైయుండ మేవాడురాజ్య మింతకాలము స్వతంత్రముగా గౌరవముతోఁ దలయెత్తుకొని యుండుట విధాతకును నిష్టములేదు కాఁబోలు! ఈసారి లక్షకు మించిన సైన్యమును వెంటఁబెట్టుకొని మహబత్ ఖాను స్వయముగా మేవాడుపై దాడివెడలెను. ఇఁక

నీచిన్న రాజ్యమాతని ప్రచండవాహినిముం దెట్లు నిలువఁ గలదు ! మేవాడ్ జనని యింతకాలమునుండి మరణశయ్యపైఁ బరుండియుండి, మరణవేదన ననుభవించుచుండెను. ఇప్పటి కామె కష్టము లీడేరుటకు నంతిమదినములు వచ్చినవి.

ఇట్టి నిరాశాజనకములగు పరిస్థితులలో సయితము రాణా యమరసింహుఁడు తనధైర్యమును వీడలేదు. ఇంతవఱకు జరిగిన యుద్ధములలో నతనిసేన లతిసులభముగ గెల్చుచు వచ్చెను. కాని యీసారి మహావిప్లవము రానున్నదని యతఁ డెఱుఁగును. శూరాగ్రేసరుఁడును దనసోదరుఁడును నగు మహబత్ ఖానునకును దనకును జరుగఁబోవు ఘోరసంగ్రామము కర్ణార్జునుల యుద్ధమువలె యావద్భారతదేశంబునకును భయావహము కాఁగలదని యతఁ డనుకొనుటలో నాశ్చర్యమేమున్నది !

ఇఁక మార్వాడు రాజ్యాధీశుఁడగు గజసింహుఁడు స్వజాతి నాశమునకుఁ గడంగెనుగదా ! ఏ జాతియైనను నాశనమగుట స్వజాతీయులవలననే 'యని చరిత్ర వేనోళ్ళఁ జాటి చెప్పుచున్నది. తక్షశిలావృత్తాంతమును, జయచంద్రుని ద్రోహచర్యలును, మానసింహ, శక్తిసింహుల జీవితములును, నీనాఁడు మహబత్ ఖాను, గజసింహుల మనోవృత్తులును నిందుకుఁ దార్కాణములు. విధినిర్ణయమును మార్చ నేరికి శక్యమగును ! ఒక్కజాతిలోనే యిట్టి విధ్వంసకశక్తు లుద్భవించినపు డాజాతి పతనము కాకుండునా ? స్వయంకృతాపరాధముననే యేజాతియైన నశించును. జాతి నిర్వీర్యమైయుండ దానిని సమూలముగ నాశనముచేయు రోగము ప్రబలమైనపు డిట్టి విభీషణులు ప్రతిగృహమున జనించుచుందురు. ఏమైనఁగానీ రాణా తనసేనల నాయత్తపఱచుచుండెను.

ఇది యిట్టులుండ మహాబత్ ఖాను నిరపరాధులగు గ్రామ నివాసుల గృహములఁ దగులఁ బెట్టించుచుండెనని గోవింద సింహుఁడు రాణాతోఁ జెప్పెను. ఇందుకు ప్రతీకారము యుద్ధము తప్ప మఱియొకటిలేదని వారిద్దఱు నొక నిర్ణయమునకు వచ్చిరి. మేవాడులో నైదువేలకు మించి సేనలేదు. మహాబత్ ఖాను సేన దాదాపొకలక్ష యుండును. అట్టియెడ మేవాడు గెల్చుట కలలోనివార్త. కావున నీసారి తమరాజ్యమును పూర్తిగాధ్వంస మగునను దిగులుతో గోవిందసింహుఁడు తలవంచుకొనెను. కాని రాణా యాతని యావేదననుజూచి, 'సేనాపతీ! చింతపడెద వేల? ఇది యానందమునకు సమయము, లెమ్ము. యుద్ధమునకు నడుముకట్టుకొమ్ము. ఇంటింట మంగళవాద్యముల ప్రయోగింపఁ జేయుము. అన్ని ప్రదేశములందును నరుణపతాకంబు నెగుర వేయించుము. ఇఁకమీఁదట దానినిగాంచు భాగ్య మున్నదో లేదో. ఇప్పుడే యా పరమపవిత్ర భగవద్ధ్వజమును గన్నులారఁగాంచి యానందించుద"మని వచించెను.

గోవిందసింహుఁడు యుద్ధములో మరణించుటకు సంసిద్ధుఁడుగనే యుండెను. కాని ఈసారి తమ ప్రాణముల నిచ్చియైనఁ దమ జననిని రక్షింపఁజాలము కదా యని దుఃఖించుచుండెను. రాణా యాతని దుఃఖమునుగాంచి, "గోవిందసింహా! దుఃఖ మెందులకు? ఎవనితల్లి మరణింపక చిరంజీవియై యుండును? అట్లే మన మేవాడ్ జననియు నీనాఁడుమరణించును. ఆమెతోఁ బాటు మనమును మృతినొందెదము. ఇంతకన్న భాగ్య మేమి కలదు? ఆలమునుండి సజీవులమై తిరిగి వత్తుమో రామో! కడసారి కౌఁగిలి"మ్మని యా వృద్ధ వీరసింహుని ప్రేమతో నాలింగనము చేసికొనెను.

రాణా యానందమును గాంచి, మానవతి వివాహము నిశ్చయమయ్యెనని రాణి భ్రమపడెను. కాని యీ తూరి సోదరులలోఁ బరస్పరయుద్ధము సంప్రాప్తము కానున్నందున మేవాడ్ వివాహము వినాశనముతోను, విధ్వంసముతోను బూర్తియగునని రాణా పలికిన మాటలను సరిగా నర్థముచేసి కొనలేక రాణి యాతని నున్మత్తునిగా భావించెను. మహాబత్ ఖానును, గజసింహుఁడును రాజపుత్రులేయయ్యు, సాటి రాజ పుత్రులపై నింత యీర్ష్యాద్వేషములఁ జూపుచున్నందుకు మానవతి మిగుల వగచుచుండెను. సోదరులలోఁ బరస్పరకలహము లుదయించినపు డా యధమజాతి పతనము కాకుండునా? అట్టి జాతిని బరమేశ్వరుఁడైన రక్షింపఁగలఁడా?

## మేవాడు దహనము

వీరనారీమణియగు నా సుభాషిణి తన ప్రియసుతుఁడగు నరుణుని వెంటనిడుకొని మేవాడు పరిసరగ్రామములలోఁ దిరుగుచు దేశభక్తి జనకములగు గీతములఁ బాడుచు, నుద్రేక పూరితములగు నుపన్యాసముల నిచ్చుచు, గ్రామీణులను సమరమునకుఁ బురికొల్పుచుఁ బ్రాణములనైన నిచ్చుటకు సంసిద్ధులైన యైదువేల సైనికుల నాయత్తపఱచెను. బాలుండయ్యును బెక్కుకష్టములకోర్చి, యామెకుఁ జేదోడువాదోడుగాఁ జరించుచున్న యా యరుణకుమారుని ధ్యేయనిష్ఠ ప్రశంసనీయము. గతయుద్ధములలో మేవాడు వీరకులమంతయు నంతరించుటచే నవీన వీరకులమును సృష్టించుట తమ విధియని నమ్మి, మాతాపుత్రులా కార్యమును దమజీవితలక్ష్యముగాఁ బెట్టుకొని, తమ జీవయాత్రను గడుపుచుండిరి. వీరిజీవిత మెంత ధన్యమైనది!

మహబత్ ఖాను నొద్ద సెలపుఁ గైకొనిన గజసింహుఁడు ముగల్ సేనల సాహాయ్యమున మేవాడు గ్రామముల ముట్టడించి, యమాయికులగు గ్రామవాసుల యిండ్లను గాల్పించుచుండెను. ఆ మంటలు మింటినంటుచుండెను. ఒకగ్రామము తగులఁబడుచున్నప్పు డితరగ్రామస్థు లూరక చూచుచుండిరి. ఒక గృహము కాలుచున్నపుడు ప్రక్కయింటివారలు మిదలక వీక్షించుచుండిరి. కొందఱు పాఱిపోవుచుండిరి. మేవాడులోని గ్రామవాసు లందఱు నేకమైన నేమయ్యెడిదో! ఫలిత మేమైనను వా రేకమగుట వారి ధర్మము కాదా! ఐక్యతాప్రభావమును గూర్చి వేఱు చెప్పవలయునా ? తృణంబులు సైతము కలిసి వెంటిగా నేర్పడి మదగజంబునైన బంధింపఁ జాలును. వృక్ష శాఖలందలి పత్రములు గుబురుగాఁ బెరిఁగి, తరుమూలమున విశ్రమించు పాంథులకు శీతలచ్ఛాయ నొసంగి చండమయూఖుని తీక్ష్ణాతపమునుండి వారిని రక్షింపఁగల్గును. నదీప్రవాహములచేఁ జిందరవందర చేయఁబడు నిసుక రేణువులును సిమెంటు సున్నముచే నతుకఁబడి మహోన్నత భవనభారమును మోయఁగల్గు పెద్దగోడలుగాను, దూలములుగాను, స్తంభములుగాను రూపొందును. ఇంతయేల ? పూర్ణాంకము సయితము మఱియొకసంఖ్యతోఁ జేరినయెడల దానివిలువ పదిరెట్లు పెరుఁగును. అట్టియెడ నసంఖ్యాకులగు మానవు లేకమైన వారు సాధింపలేని పనియుండునా ?

"సమాజము నాశనమైన నాకేమి? నేనుసుఖముగానున్నాను గదా!" యనువ్యక్తి స్వార్థము దేశవినాశమునకుఁ గారణమైనది. సమాజసుఖమే నా సుఖము, నా సుఖమే సమాజసుఖము. సమాజమునకు నాకును నవినాభావసంబంధము

కలదను సాంఘికదృష్టి లోపించుటయే యనేక యాపదలకు మూలమయ్యెను. పూర్వము భక్తియార్ ఖిల్జీ పదునెనిమిది మంది యనుచరులతో నొక స్వతంత్రరాజ్యమును మన దేశములో స్థాపింపఁదలఁచి తూర్పుగాఁ బోవుచు దారిలోనున్న యిరువది కోట్ల ప్రజలను నిరాటంకముగా దోచుకొనుచు, సంహరించుచు వేయిమైళ్ళు దూరము పోయెను. అప్పుడు నలంద విశ్వవిద్యాలయమున నిరువదివేల యధ్యాపకు లుండిరి. ఇఁక విద్యార్థు లెందఱుండియుందురో! విశ్వవిద్యాలయ మంతయు భస్మీభూతము గావింపఁబడెను. అధ్యాపకులందఱు సంహరింపఁబడిరి. పందొమ్మిదిమంది యింతపని చేయుట యూహాతీతము. ఒక గదిలోనివారు హింసింపఁ బడుచుండఁ బ్రక్కన గదులలోనివారు తలుపులువేసికొని కిటికీలగుండఁ దొంగి చూచుచు మెదలకుండిరి. ఇదియంతయు నసైక్యతాఫలముకదా!

మేవాడుగ్రామములలో గృహదహనములు జరుగుచుండ, నెక్కడఁజూచినను హాహాకారములే. పశువులు, శిశువులు, బాలురు, వృద్ధులు గృహంబులతోఁ బాటు పరశురామప్రీతి యగుచుండిరి. నలుదెసల రోదనములు, నాక్రందనములును వినవచ్చుచుండెను. ఏడ్చుచుఁ బరుగిడు జానపదుల వెంటఁ బడుచు ముగల్ సైనికులు తుపాకులఁ గాల్చుచుండిరి. “చంపకుఁడు! చంపకుఁడు! రక్షించుఁడు, రక్షించుఁ”డను నార్తనాదములు హెచ్చుచుండెను. సర్వసేనాని యాజ్ఞానుసారము గృహదహనమున కడ్డువచ్చిన వారి నందఱను నిర్దాక్షిణ్యముగ సంహరించుచుండిరి.

మహాబత్ ఖానునొద్ద సెలవుగైకొని వెడలిన పర్వేజు చిత్తూరుకోట నాక్రమించుటకు లక్షసైన్యముతోఁ బోయి తమ్మిది

రించిన యల్పసంఖ్యాకులగు రాజపుత్ర సైనికులను ఘోరముగా సంహారించెను. కొంతవడికి యుద్ధభూమిని మడిసిన రాజపుత్రుల రక్తము కాలువలై పాఱెను. ముగలులు గనంబడిన రాజపుత్రు నెల్ల వధించుచుండిరి. ఒకగడియలో మేవాడు శూరజనశూన్య మయ్యెను.

గోవిందుని గృహమును వీడిన మంగళయు, నామె ప్రియ సోదరుండగు నజయుండును భిక్షాటనవృత్తిచే నొక గ్రామమున నివసించుచుండిరి. గజసింహుఁడు దారికడ్డువచ్చిన గ్రామముల నన్నింటిని దగులఁబెట్టుచు, వీరున్న గ్రామమును సమీపించి తన సేవకులచేత దీనినిగూడఁ గాల్పించుచుండెను. గ్రామస్థులు భయభ్రాంతులై పాఱిపోవఁదొడఁగిరి. ముగలు సైనికులు తమ్మెదిరించు వారి నెల్ల వధించుచుండిరి. కొందఱు వధింపఁబడు చుండఁ గొందఱు మెదలక చూచుచుండిరి. ఆపదలో నున్న వారిని రక్షింపుఁడని యజయుఁడు వారి నెంతప్రోత్సహించినను వారు, 'మేమేమిచేయఁగల'మని నిరుత్సాహముతోఁబలికిరి. ఇట్టి యత్యాచారములు జరుగుచుండఁ దమ ప్రాణంబుల దక్కించు కొనుటకుఁ గొందఱు పాఱిపోవుచుండిరి. ఎంత వెఱ్ఱివారు! పాఱిపోయినంతమాత్రమున మరణము తప్పునా? వారివంతును వచ్చెను. వారియిండ్లనుగూడఁ దగులఁబెట్టుదురు. "మనయిండ్లు తగులఁబెట్టినపుడు చూతములే" యని యొకఁ డనుకొనెను. "ఆయువు గట్టిగానుండిన నెవఁడు చచ్చును"అని మఱియొకఁడు తలంచెను. ఇట్లనుకొనుచుండగాఁ "పాఱిపొండు, పారిపొం"డను కేకలు వినవచ్చెను. అజయసింహుఁడును, మంగళయును దప్పఁ దక్కిన వారెల్లఱును బాఱిపోయిరి.

సైనికుల కోలాహల మింకను సమీపమున వినవచ్చు చుండెను. తుపాకుల మ్రోతలు భయంకరములుగ వినిపించెను. మంగళను కొంచెము వెనుకకుఁ బోయి నిలువుమని చెప్పి, యజయుఁడు దీనులను రక్షింప నిశ్చయించెను. మంగళయును నీ పవిత్రకార్యమునకు నాతనిఁ బ్రోత్సహించెను. వారిని రక్షింపఁ గల్గినను, లేకున్నను వారికొఱకై తన ప్రాణముల నర్పింప సిద్ధముగనుండెను. మానవతి యొద్ద నేర్చిన, దీనరక్షణ యను మహామంత్రమును సాధింపఁదలఁచెను.

విచ్చుకత్తులఁ జేతఁబట్టుకొని చాలమంది మొగలుసిపాయిలు వెంటఁబడుచుండఁ గొందఱు గ్రామస్థులు రొప్పుచువచ్చి యజయుని శరణుఁజొచ్చిరి. వెంటనే యజయుఁడు తన కరవాలంబు నొరలోనుండి లాగి యా మొగల్ సిపాయిలతోఁ బోరాడి యొక్కకరినే నేలఁగూల్చెను. కాని యాతనిపైకి నింకను సిపాయీలు విఱుచుకొని పడుచుండిరి. అప్పుడు పరిస్థితి విషమించినదని గ్రహించి మంగళను బాఱిపొమ్మనెను. కాని యామె ప్రియసోదరుఁడు తన ప్రాణముల నర్పించుచుండఁ దానెట్లు పాఱి పోవఁగలదు? అచటనేయుండి యా భయంకరయుద్ధము నావేదనతోఁ గాంచుచుండెను. ఆనాఁడు పద్మవ్యూహంబుఁ జొచ్చి కౌరవయోధులతో నేకాకియై పోరిన యభిమన్యు చందమున, నా యజయకుమారుఁడు తనచుట్టు నావరించిన శత్రునివహంబుతో నత్యద్భుతముగఁ బోరాడఁజొచ్చెను. అట్టి యెడ నొక మొగల్ సిపాయి పేల్చిన తుపాకిగుం డాతని వక్షంబును వ్రక్కలించినందున నావీరకుమారుఁ డవనిపైఁ నొరిగెను.

మంగళ వెంటనే పరుగిడుచు వచ్చి “సోదరా! సోదరా” యనుచు విలపించుచుండెను. ఆ సిపాయి లామెను బంధింపఁ

ప్రయత్నించిరి. కాని స్త్రీలపై నత్యాచారములఁ జరుపవలదని మహాబత్ ఖా నాజ్ఞాపించుటచే వా రామెజోలికిఁ బోఁజాలరైరి. ఇంతలో నజయుఁడు, "మంగళా! నేను మరణించుచున్నాను. ఈశ్వరుఁడు నిన్ను రక్షించుఁగాక!" యని పలుకుచుఁ బ్రాణముల విడిచెను. మంగళ "సోదరా! సోదరా! యెచటికేఁగితి" వని యేడ్చుచు నాతని శవముపైఁ బడెను.

కొంతసేపటి కామె యూరడిల్లి సోదరుని దలఁచుకొని, "క్షత్రియవీర! నేనిఁక దుఃఖపను. నీవు నీధర్మమును నెఱపితివి. దీనులును, నసహాయులును నగువారి రక్షణకై నీప్రాణముల నర్పించితివి. ఇఁక నీ ముగల్ సైనికులన్ననో, సైతానుదూతలు. రక్తపిపాసగల ఘాతుకజంతువులు. వీరు నిరపరాధులగు జానపదుల గృహములఁ దగులఁబెట్టుచు, వారిని సంహరించిరి. ఇట్టి పరమపాపులకు నరకమునఁగూడ స్థానములేదేమో!" యని పలికి ఖిన్నురాలై యుండ నొకసిపాయి, "అమ్మా! యీహింసాకాండకు మేము బాధ్యులము కాము. ఇది మా సేనానియగు మహాబత్ ఖానుని యాజ్ఞ" యనిపలుక మహాబత్ ఖాను పేరు విని చకితయై, "ఏమీ! మహాబత్ ఖాను మీసేనాధిపతియా, అతఁడే మేవాడుగ్రామములఁ దగులబెట్టుఁడని యానతిచ్చెనా? అట్లైన నన్ను మీ సేనాధిపతియొద్దకుఁ దోడ్కొని వెళ్ళుఁ" డని యామె కోరినవిూఁదట, వా రామెను సురక్షితముగ మహాబత్ ఖాను నొద్దకుఁ గొంపోయిరి.

## మాతృ సాక్షాత్కారము

రాణా యుద్ధముచేయ నిశ్చయించి సేనాపతియగు గోవిందసింహుని, సామంతరాజులను నుదయపురమున సమావేశ

పఱచెను. సామంతు లెన్నఁడును సమరమునకు వెనుఁదీయు వారు కారు. కాని మేవాడు రాజ్య మందంతటను నైదు వేలసేన నైనను సంగ్రహింపఁ గల్గుదుమా యని వారు సందేహించు చుండిరి. ఒకవేళ నీసేనను సమకూర్చినను లక్షసైనికులతోఁ బోరు టెట్లా యని రెండవసందేహము. ఈపరిస్థితులలో యుద్ధము చేయుటయసంభవమనియు, నీసమయమున మొగలులతో సంధిఁ గావించుటయే మేలనియు వారి యభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని మానధనుఁడును, బలాక్రమనంతుఁడును నగు రాణా, "సామంతులారా! కష్టనిష్ఠురముల గుఱించి నాకుఁ జెప్పకుఁడు. నేను వానిని లెక్క-చేయను. సేనల నాయత్తపఱపుఁడు. మన కసాధ్యమగున దేదియులేదు. మన యైదువేలసేన యైదులక్షల సేనకు సమానము. ఇదివఱకు మొగలులు మనతో సంధిరాయ బారమునకై వారంతట వారే దూతను బంపినపుడు, వారి మాటలను నా మాటలనుగూడ నిరాకరించి, మీరు యుద్ధము చేసి తీరవలెనని పట్టుపట్టితిరి. ఇప్పుడు మనమే వారిని సంధి కొఱకై ప్రార్థించుట గౌరవహీనము కాదా! కావున నామాట కెవ్వరును నభ్యంతరము చెప్పకుఁడు. యుద్ధముచేసి మరణించుట కన్న మనకు వేఱొండుపాయంబులే" దని వారితో స్పష్టముగా వచించెను. మహావీరుఁడగు నా గోవిందసింహుఁడు, "మాన రక్షణకై ప్రాణములనైన నిత్తు"నని యా సభలోఁదనమనోనిశ్చ యమును వారి కెఱింగించెను. ఆతని ధీరత్వమునకు రాణా మిగులసంతసించి, సామంతులందఱికిని వెంటనే యుద్ధసన్నాహము గావింపుఁడనియు, నరుణపతాకము నెగుర వేయుఁడనియు, రణ భేరిని మ్రోగింపుఁడనియు నానతిచ్చెను.

నిర్మలాంతరంగుఁడగు నా యమరభూవిభునకు మేవాడ్ జననీసాక్షాత్కార మయ్యెను. ఆమె వస్త్రములు చినిఁగి దేహమంతయు ధూళిచేఁ గప్పఁబడి శిరోజములు విరియఁబడి యుండెను. మృతప్రాయముగనున్న యా సాధ్విని క్రూర సైనికులు వధ్యస్థానమునకుఁ గొంపోవుచుండిరి. ఆమె సౌభాగ్య సూర్యుఁ డస్తమించుచున్నపుడు సైత మామె ముఖమున నొక దివ్య జ్యోతి, యొకయపూర్వమగు సౌందర్యము విరాజిల్లుచునే యున్నట్లా రాణా తన మనో నేత్రముతోఁ గాంచఁగల్గెను.

ఇట్లు మాతృదేవీసాక్షాత్కారముఁ గాంచుకొనఁ గల్గిన పుణ్యశాలురే యథార్థమైన దేశభక్తులు. అట్టివారు స్వలాభ మునకై దేశము నెన్నఁడైన నష్టపఱతురా? అనుక్షణమును దేశపు దుస్థితిని స్మరించువాఁడు స్వసుఖము నపేక్షించి మాతృ భూమిని శత్రువులపాలు చేయఁడు. తల్లి మరణావస్థలో నున్న ప్పుడు భోగవిలాసములకుఁ జిక్కి యవినీతిపరుఁడై యామెను విస్మరించువాఁడు మాతృద్రోహి కాఁడా?

## మోహభంగము

మహబత్ ఖానుఁ డిస్లాము మతమును స్వీకరించినను దాను రాజపుత్రజాతికిఁ జెందినవాఁడనియు, నమరసింహుని సోదరుఁ డనియు మఱువలేదు. అయిదు వేల సైనికులతో, లక్ష సైనికుల నెదుర్కొన వచ్చినవాఁడు సాధారణవ్యక్తి కాఁడనియు, రాజ పుత్రుఁడు తప్ప మఱెవ్వఁడు స్వదేశముకొఱకు నింత నిర్భయ ముగాఁ బ్రాణముల నర్పింప సిద్ధపడఁడనియు నతనికిఁ దెలియును.

గజసింహుఁడును రాజపుత్రుఁడే కాని పతితుఁడయ్యెను. ఇది యెంత యవమానకరము! ఎంతవాఁడుగ నుండవలసిన వాఁ

డెట్టులయ్యెను ! మహాబత్ ఖా నొకప్పుడు రాజపుత్రుఁడు కాని యిప్పుడు కాఁడు. గజసింహుఁ డిప్పటికిని రాజపుత్రుఁడే కద ! ఐనను వారి స్వభావములలో నెంతభేదము కలదు !

యుద్ధమున రాణా యమరసింహు నెవ్వరును జంపలేదు. బందిగాఁగొనలేదు. ఇది గజసింహునకుఁ గష్టముఁ గలిగించెను. కాని మహాబత్ ఖానునాజ్ఞయట్టులుండ నతఁడేమి చేయఁగలఁడు? "అమరసింహునివంటి శత్రువు ప్రపంచమున గానరాఁడు. అతఁడు గౌరవార్హుఁడు. అట్టివానిని బోఁగొట్టుకొనరా"దని ఖాను త్రికరణశుద్ధిగ నమ్మెను.

దగ్ధమగుచున్న గ్రామములు మహాబత్ ఖానునకుఁగన్పించుచుండెను. గ్రామవాసుల రోదనములును, హాహాకారములును వినిపించుచుండెను. అంతట నతఁడు, "హిందువులారా ! మీ మతోత్కృష్టతను స్మరించుచు మరణింపుఁడు. నేఁడు మీ దురహంకారమును, జాతివిద్వేషమును, జూర్ణము గావించుచుంటిని. ఇప్పటికి మీకుఁ బూర్తిగ గర్వభంగమైన"దని సదర్పముగఁ దనలోఁ దా ననుకొనుచుండెను.

ఇంతలో ముగల్ సిపాయిలు కొందఱు మంగళను వెంటఁ బెట్టుకొని ఖానునొద్దకు వచ్చిరి. వారినిఁజూచి యాశ్చర్యపడి, "స్త్రీలజోలికిఁ బోవలదని చెప్పితినిగదా ! ఈమె యెవరు ? ఎందుకుఁ బట్టితెచ్చుచుంటి"రని యడుగ, వారు సవినయముగా "మహాప్రభూ! ఈమెను మేమెఱుఁగము. మేము బలాత్కరించి యీమెనిటకుఁదెచ్చుటలేదు. స్వయముగానే మావెంటవచ్చిన" దనివిన్నవించిరి. అంతమంగళ మహాబత్ ఖానుతో, "అయ్యా! నే నెవ్వతెనో మీకుఁదెలియనక్కఱలేదు. మీరు నన్ను బలవంత

ముగ నిచటకుఁ దోడ్కొనిరాలేదు. కొండొక విషయమున న్యాయము నరయఁగోరి స్వయముగానే మీ దగ్గఱకు వచ్చితిని. నిరపరాధియగు నా సోదరుని మీ భటు లన్యాయముగ యుద్ధముసఁ జంపిరి. ఇది ధర్మమేనా?" యని ప్రశ్నించెను. అందుకా ఖాను, "తరుణీ! గ్రామములఁ గాల్చుఁడనియు, నా పనికి నడ్డువచ్చిన వారిని నిర్దాక్షిణ్యముగ సంహరింపుఁడనియు నా సైనికుల కానతిచ్చితిని. మీ సోదరుఁడు వారి నెదిరించియుండును. వారు నా యాజ్ఞానుసార మాతనిఁ గడతేర్చియుందురు. ఇందు వారి నేరమేమియులే"దని బదులు చెప్పెను.

మంగళ:- అక్కటా! ఏ పాపము నెఱుఁగని గ్రామవాసుల హింసించుఁడనియు, వారి యిండ్లను దగులఁబెట్టుఁడనియు మీరే మీ భటుల కానతిచ్చితిరా? ఎంత ఘోరము!

మహ:- అవును నేనే యాజ్ఞయిచ్చితిని.

మంగళ:- మీ రింతటి కఠినులని నే నెన్నఁడును గలనైనఁ దలఁచలేదు.

మహ:- నీ వెవ్వతెవో నాకుఁ దెలుపవైతివి. నన్ను గుఱించి నీ కీ సదభిప్రాయ మెట్లు కలిగె?

మంగళ:- నా పతి యెన్నఁడును నిట్టి క్రూరత్వమునకుఁ బాల్పడఁడు.

మహ:- ఏమీ! నీ పతియా! ఎవరు?

మంగళ:- అవును. నా పతియే. ప్రాణనాథా! చిరవియోగముచే నన్ను గుర్తించితిరో లేదో, నా వంక నొక్కసారి సరిగాఁ జూడుఁడు. అన్యమతము నవలంబించిన మీచేఁ దిరస్కరింపఁబడిన హిందూవనితను. మంగళను.

మహాబత్ ఖాను విభ్రాంతుఁడై యాశ్చర్యముతో, 'మంగళా! మంగళా! ఏమీ! నా భటులు నీ సోదరుఁడగు నజయుని జంపిరా?' యని యడిగెను.

మంగళ – అవును. మీరు మతాంతరులైనను మిమ్ము నా జీవితమునకు లక్ష్యముగానిడుకొని పూజించినందుకు నా తండ్రి నన్నింటనుండి వెడలఁగొట్టెను. అప్పుడు నా జీవితనౌక నీ యపార సంసారసాగరమున వైచి మిమ్ము నప్పటికిని నా జీవితమునకు ధ్రువనక్షత్రముగఁ గైకొని పోఁబోవుచుండ నా సోదరుఁడగు నజయుఁడు సంతోషపూర్వకముగ నన్ను రక్షించుటకై నావెంటవచ్చి నాకొఱకై యెన్ని యోకష్టములకు గుఱియయ్యె. ఒకప్పుడు మీ దుష్టభటులు నన్ను బాధింపఁబోవుచుండ నితఁ డడ్డమువచ్చి, వారితోఁ బోరాడుచు క్షతగాత్రుఁడయ్యెను. చాలదినములు నే నాతని నొక పేదకుటీరములో నుంచి, యుపచారము చేయుచు, బిచ్చమెత్తుకొని జీవయాత్రను గడపుచుంటిని. అట్టి నా యనుంగు సోదరుని మీ యాజ్ఞానుసారము మీ సైనికులు చంపివేసిరి. నన్ను రక్షించుటకువచ్చిన నా సోదరుఁడు నా కొఱకై ప్రాణముల నర్పించియుండ, నే నిఁక జీవింపనేల? నన్నుఁ గూడ సంహరించి పుణ్యము గట్టుకొనుఁడు.

మహా:– అట్లనకుము. మంగళా! నన్ను క్షమింపుము.

మంగళ:– ప్రాణేశ్వరా! కష్టజీవులును, నిర్దోషులు, నగు నీ గ్రామవాసుల హత్యకుఁ గారకులు మీరేనా?

మహా:– అవును. మంగళా! రాజపుత్రవంశజులను రూపుమాపు నుద్దేశముతో నేనే యిట్టు లాజ్ఞాపించితిని.

మంగళ:—అక్కటా! దైవమా! ఎంతపని చేసితివి! ఇట్టి నరహంతకుఁ డగు మహబత్ ఖానునేనా నేనింతకాలము నుండి పూజించుచుంటిని! ఈ క్రూరుని నా హృదయమున నెలకొల్పుకొనియేనా నేను సంసారమును బరిత్యజించితిని! అయ్యో! నా సోదరునితోఁబాటు నేనును మరణించిన నెంతబాగుండెడిది? పరమేశ్వరా! నాసోదరుని, నాపతిని నొక్కసారిగాఁ బోఁగొట్టుకొంటినిగదా? నావంటిదురదృష్ట వంతురాలు మఱెవ్వతె యుండును?

అంతట మహబత్ ఖాను తాను గావించిన క్రూరకృత్యములకుఁ గారణమేమో చెప్పఁబోవుచుండ, నాతని మాటల కడ్డమువచ్చి, 'మంగళ యిట్లావేశముతోఁ బలుకఁజొచ్చెను. "నాథా! ఇఁక నాకేమియుఁ జెప్పకుఁడు. చాలును. మీ మాటలను నేనిఁక వినను. ఈక్షణముతో మీపైనాకుఁగల మోహము భంగమయ్యెను. నా ప్రేమ నేఁటితో నిరాశ్రయ మైనది. నేఁటివఱకు మిమ్ముఁ బరదేవతగా భావించి, యారాధించుచుంటిని. ఇఁక మీఁదట మిమ్ము బరమశత్రువునుగాఁ బరిగణింతును. మొగలులనుగూడ నేను మీవంటి వైరులనుగా నెంచను. వారిని సయితము మీరు క్రూరత్వమున మించితిరి. వారు మనజాతివారు కారు. కాఫిరులను నిర్దాక్షిణ్యముగ సంహరించుఁడని వారిమతము వారికి బోధించునేమో! అట్లైన వారు వారి మతోపదేశముల ననుసరించి యిట్లుచేసినఁ జేయవచ్చును. కాని మీరన్ననో యీ మేవాడ్ జననికిఁ బుత్త్రులు. సూర్యవంశజులగు రాజపుత్రజాతికిఁ జెందినవారు. సంచమగు రాజపుత్రరక్తము మీశరీరములోఁ బ్రవహించు

చున్నను, క్షుద్రమగు ధనకాంక్ష చేతను, జాతి, మత విద్వేషముచేతను స్వజాతి నాశనమునకుఁ బూనుకొంటిరి. స్వామీ! ఇఁక నేనేమి చెప్పఁగలను? ముగలులు కేవలము మేవాడును జయించుటకే యిచటికి వచ్చిరి. కాని దరిద్రులగు పల్లెటూరి వారి యిండ్లను గాల్పఁదలఁపలేదు. మీరా లోపమును బూర్తి చేసితిరి. మీరు వారి ధర్మము ననుసరించితిరే కాని, వారికున్న నీతి మీకు లేకపోయెను గదా! సాయుధులైన మీ భటులను నిరాయుధులును, నిరపరాధులు నగు గ్రామీణులపై వదలిపెట్టితిరి. ఇప్పటికే చాల కష్టముల ననుభవించుచున్న మేవాడు రాజ్యము నొక్క త్రుటిలో శ్మశానవాటికగ మార్చితిరి. ఏతల్లి గర్భమున జనించి, యేతల్లి యొడిలోఁ బెరిగితిరో, యాతల్లి గొంతుకోయుటకు సిద్ధపడితిరి. తల్లిఋణమును మన మెన్ని జన్మలకైనను దీర్చుకొనఁ జాలము. అట్టియెడ నింతటి మాతృద్రోహమా! నిర్దయులై మీరు మేవాడు రాజ్యమునఁ గావించిన ఘాతుకకృత్యములకోర్వఁజాలక ఘోరముగఁ జచ్చుచున్న దీనుల యార్తనాదములతో దిక్కులు పిక్కటిల్లుచున్నవి. ముగలు లెన్నఁడైన నిట్టిపనిని జేయఁదలఁచిరా? హా యీశ్వరా! యిట్టి దేశద్రోహులకు నీవు విధింపఁదగిన దండనము లేదా!"

మహా:—మంగళా! నేనీ యుద్ధమునకు దిగినది నీకొఱకే కదా!

మంగళ:—ఏమీ! హింసాయుతమును, నధర్మమును నగు నీయుద్ధము నాకొఱకా! దీనికిఁ గారణము నేనా! నమ్మఁజాలను. ఇది కేవల మనృతము.

మహా :- కాదు మంగళా యిది ముమ్మాటికిని సత్యము. నీ తండ్రి గోవిందసింహుఁడు తనకుముసల్మానులపైఁగల ద్వేషముచే మతాంతరుఁడనగు నాయందు నీవు పతిభక్తిని జూపిన కారణమున నిన్నింటినుండి బహిష్కరించెనని విన్న వెంటనే రోషావేశముచే మేవాడుపైఁ గత్తికట్టితిని. దురహంకార పూరితమగు రాజపుత్రవంశమును నిర్మూలింపఁ దలఁచితిని.

మంగళ :- ఒక్క వ్యక్తి యపరాధము గావించి నంతమాత్రమున జాతి నంతను ధ్వంసము చేయుట ధర్మమా? ఇంత వంశ నాశనమునకు గోవిందసింహుఁ డొకఁడు కారణమా?

మహా :-ఇందుకు సందేహమా! ఒక్క రావణుని యపరాధము స్వర్ణమయమగు లంకారాజ్యమునకును, బులస్త్య బ్రహ్మకు జనించిన రాక్షసవంశమునకును జేటు తెచ్చినది. ముసల్మానులపై నింతటి ద్వేషము మీతండ్రికి మాత్రమే కాదు, సమస్తహిందువులకును గలదు. వారి కందఱకును గల ద్వేషమునే మీ తండ్రి వెల్లడించెను. రాజపుత్రులకుఁ గల యీజాతి ద్వేషమునకుఁ బ్రతీకారముగ నేనీవిధమున మేవాడుపై నెత్తిరావలసి వచ్చెను.

మంగళ :- మొగల్ సేనానీ! యిట్టి ప్రతీకారచర్య ముసల్మాను జాతికిఁ జెందినవాఁడే తీసికొనగలఁడు. హిందువులకు ముసల్మానులపైఁ విద్వేషము కలదని మీరు ముసల్మానులెతిరా? స్వామీ! యిది మీరు తెచ్చిపెట్టుకొన్నదే. అన్యాయమునకుఁ బ్రతీకారముఁ జేయుచుంటినని యేల భ్రమపడెదరు? మీ మహమ్మదీయత్వము కాదు, మీ యహంకారమే యీ పనికి మిమ్ముఁ బ్రేరేపించుచున్నది.

మంగళ మాటల నాలించి మహబత్ ఖాను వాస్తవముగఁ దనదే పొరపాటాయని సందేహింపఁ జొచ్చెను. ఇంతలో మంగళ, "వ్యక్తిగత ద్వేషమును బురస్కరించుకొని మేవాడు వినాశమునకుఁ బూనుకొంటిరి. ఇదియా మీ ధర్మము! ఇదియా మీ శూరత్వము! ఇదేనా మీ మానవత్వము! దైవమా! నా జీవితలక్ష్యములను వ్యర్థము చేసితివా!" యని నిరాశతోఁ బలికెను. అందుకు మహబత్ ఖానుఁ డేమో చెప్పఁబోయెను. కాని మంగళ యతనిని మాటాడనియ్యక, "మహబత్! చాలు, చాలు. మీరు నా నాథులని, నేను మీ ధర్మపత్నినని యింతవఱకు భావించుచుంటిని. ఈ విశ్వాసముతోనే యొకనాఁడు నా తండ్రితో 'మా యిద్దఱి ప్రేమకు నెవ్వరు భంగముకలిగింప'రని ధైర్యముగాఁబలికితిని. కాని నేనే పొరపడితిని. ఇప్పుడు మీకును నాకును మధ్య నొకయపార పారావార మడ్డువచ్చినట్లగపడుచున్నది. భార్యాభర్తల మని నమ్మిన మన యిద్దఱి మధ్య నా ప్రియసోదరుని మృతశరీరము పడియున్నది. ఇంతియకాక మన యుభయములనడుమ నా దేశీయుల రక్తము వెల్లువలై పాఱుచున్నది. పాషాణహృదయుఁడవు, దేశద్రోహివి, రుధిరపిపాసివి, హంతకుఁడవునైతివి. ఇంక నీ మొగముచూచినఁ బాతకములుచుట్టుకొనును. పరమేశ్వరా! యిట్టివాని నేల సృజించితివి? సృజించితిపో యిట్టివానిని నాకు భర్తగాఁజేసి, వానిపై నాకేల యచంచలప్రేమ జనింపఁజేసితివి!" అని విచారపడుచు నాతని విడిచి, వడివడిగ నటనుండి పరుగిడెను. మహబత్ ఖాను నిశ్చేష్టుఁడై యచటనే యొక శిలావిగ్రహమువోలె నిలిచియుండెను.

# అగ్ని వర్షము

మేవాడు పతన కారణమైన కడపటియుద్ధ మతి విచిత్రముగ నొక గడియలో ముగిసెను. యుద్ధము జరిగినట్లేలేదు. ఉభయ పక్షములలోని యోధులును బారులుతీరి యెదురుల నెదిర్చి నెలలు, దినములు, గంటలు పోరాడలేదు. శస్త్రప్రహారములకు గాని, బాణవర్షమునకుఁ గాని యవకాశము కలుగలేదు. ఆహవమున వీరుల ధిక్కారములుగాని, హుంకారములుగాని వినిపించలేదు. సైనికుల వ్యూహచాతుర్యములకు స్థానములేదు. ఐదువేల రాజపుత్రసైనికులు కదనరంగమున నడుగిడగనే యాకసమునుండి యుల్కాపాత మగుచున్నదోయనిన ట్లసంఖ్యాకములగు ముసల్మానుసేనలు చుట్టుముట్టి రాజపుత్రులపై శతఘ్నులఁ బ్రేల్చెను. యోధుల కన్నులు మిఱుమిట్లుక్రమ్మెను. చెవులు బ్రద్దలయ్యెను. హృదయమదరెను. తలతిరిగెను. కొంత వడికి నిద్రనుండి లేచినట్లయ్యెను. అనలజ్వాలలు వారిని నలుదెసల నావరించెను. అటు గజసింహుఁడు గావించు గృహదహనముల ఫలితముగఁ బ్రజ్వలించు నగ్నిశిఖలు ధూమసహితములై యన్నివైపుల నలముకొనెను. పాప మా రాజపుత్రుల కెటు చూచిన నగ్నివర్షములే, యుల్కాపాతములే, యభిశాప పూరంబులే. ఆ భయంకరపావకజ్వాలలో రాజపుత్రులెల్లఱు శలభంబులమాడ్కి నశించిరి.

ఆ ఘోర నిశాసమయమున నా మహాశ్మశాన భూమిలో నా శవరాసుల నడుమ వీరవిహారముచేయుచున్న యా రాణా యమరసింహుని మీఁది కొక్కఁడును రాఁడయ్యె. ఆతని నెదుర్కొను యోధుఁడెవండును నా రణరంగమునఁ గన్పించ

లేదు. తన కెనయగు జోదునిచేతిలోఁ జావ నిశ్చయించుకొని బిగ్గఱగా "మహాబత్, మహాబత్" "గజసింహుఁడా, గజ సింహుఁడా" యని యెంత కేకలు పెట్టినను బ్రయోజనము లేకపోయెను. ఎవఁడును నాతని దరిఁజేరలేదు. ఊరక కత్తి నిటు నటు విసరి, తనచుట్టుఁ ద్రిప్పెను. కాని యది యెవరికిని దగుల లేదు. అది చుట్టు నలముకొనిన గాంఢాంధకారమునే ఛేదించెను. మరియొకసారి రాణా యెలుఁగెత్తి, "భ్రాతృద్రోహీ! మహాబత్ ఖానా!" యని కేక వేసెను. కాని యతఁడెక్కడను గానరాఁ డయ్యెను.

అయ్యవసరంబున నమరసింహుఁ డొక్కతూరి నలుగడలఁ జూపు సారించెను. మినుకుమినుకుమను నా తారకలకాంతిలోఁ దన బంగారమువంటి మేవాడ్ రాజ్యమేదో యొక భయంకరమగు భూకంపమువలన ధ్వంసమైన ట్లగపడెను. ఇది చూచి యాతఁడు వేడినిట్టూర్పు విడిచెను. మృతప్రాయమైన మేవాడు జననీశవమును దన భుజముపై నిడుకొని యచట నా కదన భూమిని జేయునదెద్దియు లేక మగుడ నుదయపురికి నేతెంచెను.

అచట, మహాబత్ ఖాను యుద్ధమున గెల్చియు నింతవఱకు సగర్వముగ నుదయపుర దుర్గప్రవేశము గావింపకుండుట రాణా కమితాశ్చర్యము కలిగించెను. యుద్ధమునఁ దా నోడినందుకు విచారము లేదు కాని, శత్రువులు తన నేల వధింపలేదాయని రాణా తీవ్రముగ నాలోచించుచుండెను.

# పుత్ర శోకము

"మరణించుటకు సిద్ధముగనున్న మాతృదేవికొఱకై ప్రాణముల నర్పించి, మీ జీవితముల సార్థకము చేసికొం"డని మేవాడు ప్రజలను సమరమునకై పురికొల్పుచున్న సుభాషిణి పల్లెపల్లెలను దిరుగుచు నొకయూరిలో వీధిప్రక్కన దుమ్ముకొట్టుకొని పడియున్న యజయునిశవమును గాంచెను. శరీరమంతయు గాయములతో నిండి రక్తముతోఁ దడిసియుండెను. "దేశరక్షణకై యుద్ధక్షేత్రమునఁ దనువుఁబాసిన యీవీరవరుఁ డెవ్వఁడా"యని యామె యాశవంబుడాసి, ముఖమును బరిశీలించిచూడ, నాతఁడజయుఁడని ధ్రువమయ్యెను. ఆతని మృతి కామె యెంతయో వంతనొంది, కొంతవడికి ధైర్యముదెచ్చుకొని, మాతృదేశమునకై యాహవమున దేహము నర్పించిన ధీరుని మరణమునకుఁ బరితాపము నొందరాదని యామెగ్రహించి, సమీపముననున్న వారి నజయుని మరణకారణంబడుగ, 'మహబత్ ఖానుని భటులు జానపదులవెంటఁబడి వధించుచుండ నా శరణార్థుల రక్షణార్థమై యజయుఁ డనేకులగు ముగలు సైనికులఁ బరిమార్చి కడకుఁ దన తనువు విడిచె"నని వారుచెప్పిరి. ఆమాట విన్నంతనే యామె వాహకులఁ బిలిచి, యజయుని శవమునుదయపురికి మోయించెను.

అజయుని మరణవార్త హతశేషులగు మేవాడు పౌరులలో దావానలమువలె వేగముగ వ్యాపించెను. ఈవార్త వారి హృదయములకు వజ్రాఘాత మయ్యెను. అతని యంతిమ దర్శనమునకై మేవాడు పౌరులు తండోపతండములుగ వచ్చి పడుచుండిరి. తుద కా శవమును వాహకులు రాజవీధులఁ

గొంపోయి సాలూంబర్ నరేశుండగు గోవిందసింహునియింటికిఁ జేర్చిరి. సుభాషిణి మాత్ర మా శవముదగ్గఱ నిలువఁబడి యుండెను. గోవిందసింహుఁ డింట లేఁడు. గృహప్రాంగణ మంతయు జనులతోఁ గిటకిటలాడుచుండెను. కొంద ఱా శవ మును గాంచి దుఃఖాతిరేకమున "మేవాడు జననీ! జగదేక వీరుఁడగు మా యజయుని భక్షించితివా! ఎంత నిర్దయురాల" వని నిందుంచుచుండిరి. మఱికొందఱు, "కఠినచిత్తుఁడగు గోవిందసింహా! నీ వానాఁడు నిర్దయుఁడవై నీ పుత్రికను, బుత్రుని నింటినుండి వెడలఁగొట్టితివి. మతోన్మాదివై నీ బిడ్డ నింటినుండి బహిష్కరింపకుండిన నజయుఁ డీ ట్లకాలమృత్యువు నోటఁ బడకుండెడివాఁడేమో! కటకటా! ఎంతపని చేసితి!" వని గోవిందుని దూఱుచుండిరి.

ఇట్టితఱి సుభాషిణీ సుతుఁడగు నరుణసింహునివలన నీ దారుణమైన మరణవార్తవిని గోవిందసింహుఁ డచటికి వచ్చెను. వయోవృద్ధుఁడగు నా గోవిందుఁడు తన కుమారుని మరణవార్త విన్నంతనే మఱింత క్రుంగిపోయెను. అతఁడు తన తనయుని శవముపైఁబడి దుఃఖించుచు, గద్గదస్వరముతో "సుభాషిణీ! యిది నా సుతుని శవమేనా? దీని నీ వెచటఁ గాంచితివి? నా సుతుని మృతికిఁ గతమే"మని యడిగినంత, నామె తాను గ్రామ నివాసులవలన వినినవిషయముల నాతనికిఁ జెప్పి, "గోవిందసింహా! దీనుల రక్షించుటకై నీ పుత్రుఁడు తనప్రాణముల నర్పించెను. కాన నిట్టి పుణ్యాత్మునికొఱకై మనము దుఃఖింపఁజన"దని యూరడించుచుండెను. కాని యావృద్ధుఁడు పుత్రశోకమును భరింపలేక, "నాయనా! యానాఁడు కోపాతిరేకమున నవివేకినై యకారణముగ నీవింటినుండి వెడలుచుండ నేనూరక చూచు

చుంటిని. ఒంటిగఁబోవుచున్న నీ సోదరిని రక్షించుటకు నీ విల్లు విడిచి పోతివి. అయ్యో! నిన్నేల వెనుకకుఁ బిలువక వెళ్ళ నిచ్చితిని! ఎంత క్రూరుఁడను! ఎంత పాపకర్ముఁడను! అజయా! క్షమాపణ వేఁడుకొనుటకైన నవకాశ మియ్యకపోతివే! ఇంత యభిమానమా! ఈ ముూఁడుకాళ్ళ ముసలిపై నీ కింత కోపమా! నాకిఁక దిక్కెవరు?" అని బిగ్గఱగా నేడ్వసాగెను. సుభాషిణి సాంత్వన వచనము లాతనికి మనశ్శాంతి నియ్యలేక పోయెను.

ఆ భయానక రాత్రిసమయమున బయట విజృంభించుచున్న ఝంఝామారుతము వలెనే గోవిందుని హృదయమునను తుపాను చెలరేఁగుచుండెను. ఉండియుండి యొక్కమాఱు కడుపులో మంట బయలుదేరుచుండెను. దాని నాపుకొనలేక, 'అజయా! నీవు నాకు వార్ధక్యమున జీవగఱ్ఱవై నన్నుఁ బున్నామ నరకమునుండి రక్షింతువని యాశపెట్టుకొంటిని. కాని నాకంటె ముందే చనిపోతివా? దైవమా! వృద్ధుఁడనై కాలము తీఱిన నన్నువిడిచి, దీనుల కెందఱికో రక్షణమియ్యఁగలిగిన యువకుని, నా ముద్దుబిడ్డను గొంపోతివా? ఎంతకఠినుఁడవు! ఓ మేవాడు భూమి! నీవురాక్షసివి.ఇంతమందివీరులనుఁ బొట్టనుపెట్టుకున్నను నీ యాఁకలి తీఱలేదా? చావసిద్ధముగ నున్నను నీవు శూరుల నందఱిని జంపి కాని చచ్చునటులలేవు. బంగారమువంటి నా సంసారము మట్టిపాలైనది.''యని విలపించుచుఁ దన రెండుచేతు లతో శిరమును బట్టుకొనెను. ఒకప్పుడు పుత్రశోకముచే మతి చెడినవానివలెఁ బ్రవర్తించుచు, "నా యజయుఁడు మరణించ లేదు. అదిగో! నావంకఁజూచుచున్నాఁడు. ఇంకను జీవించియే యున్నాఁ''డని భ్రమించును. అందుకు సుభాషిణి, "గోవింద

సింహా! నీ కుమారుఁ డీ లోకమున లేఁడు. శోకపరవశుఁడవై యున్మాదుఁడవు కాకుము.” అని ఆమె యనునయింప నాతఁడు, “పుత్రుఁడు లేఁడా? నేనే భ్రమపడితినా? అయ్యో! అజయా! అజయా! నా జీవనసర్వస్వమా!” యని యతిదీనముగ దుర పిల్లు చుండెను.

అయ్యవసరంబున నే మంగళ యచటికి రివ్వునవచ్చి “తండ్రీ! తండ్రీ!” యని పిలిచెను. అప్పు డా గోవిందుఁడు, “ఎవ్వరా పిలుచునది? మంగళయా? సర్వవినాశినీ! క్రూరరాక్షసీ! పండు వంటి సంసారమును బాడుచేసితివి. నా పుత్రరత్నమును నీ పొట్టను బెట్టుకొంటివి. నా బిడ్డను నా కిమ్ము”అని కోపశోకో న్మాదుఁడై పలికెను. మంగళ దుఃఖపరవశుఁడై వచించుఁ దండ్రి మాటలకుఁ గినుక వహింపక, “హా సోదరా, సోదరా”యనుచు నజయుని మృతకళేబరముపైఁ బడబోవ, నా గోవిందుఁడు, “ఛీ! పిశాచమా! నా యజయుని దాకకుము. దూరముగాఁ బొమ్ము” అని యామె చేయిఁబట్టుకొని లాగివేసెను.

పాప మా మంగళ యేమి చేయఁగలదు? నాథునిపై నాగ్రహించి యాతని విడిచివచ్చెను. సోదరుఁడుమృతినొందెను. తండ్రి యిట్లు కోపాతిరేకముచేఁ దన్నుఁ దూలనాడుచుండెను. ఇఁక నామె గతియేమి?

మంగళ ఖిన్నవదనయై, “తండ్రీ! నన్నుఁ దెగటార్చుఁడు. నేను నిశ్చయముగఁ బిశాచినే! నాకు మంగళయను పేరెవ్వరు పెట్టిరి? నేను మంగళనుగాను. నీ గృహమున నమంగళ శిఖనై జన్మించితిని. మేవాడు రాజ్యమునకు ధూమకేతువను. ఈజగతికి సర్వవినాశినిని. ఇట్టి యఘమంగళను సంహరించి యీ లోకము

నుండి పంపివేయుఁడు. మీకీ పీడ వదలును. నన్ను వధింపుఁ"డని యాతని పాదములకడ వ్రాలెను.

గోవిందుని హృది నిత్తఱి నరకజ్వాలలు దహించుచుండెను. అచట నెద్దియో పిశాచి నృత్యము చేయుచున్నట్లుండెను. ఈ దుర్భరవేదన నతఁడు సహింపఁజాలక పోయెను. కొంత సేపటి కతఁడు తెలివి తెచ్చుకొని, తన పదములచెంత నమ్రయై పడి యున్న పుత్రినిగాంచి, జాలినొంది, "బిడ్డా! చిన్నతనముననే తల్లిని గోల్పోయి, తండ్రిచే బహిష్కరింపఁబడి, భర్తచేఁ దిరస్కరింపఁబడి యెన్నియో కష్టములఁబడితివి. పరమసాధ్వివగు నిన్నవమానించినందులకే భగవంతుఁడు నాకీ పుత్రశోకమును విధించెను. కానిండు. ఇఁక నీశవమునకు నుత్తరక్రియల యథా విధిగ నెఱపుఁడు." అని పలుక, వాహకులా మృతశరీరము నెత్తఁబోవుచుండిరి.

ఇంతలో విరియఁబోసికొనిన శిరోజములతోఁ దాఱుమాఱైన కటివస్త్రముతో మానవతి యతివేగముగ నజయుని యంతిమ దర్శనమునకై పరుగువెట్టుచు వచ్చి, "అజయా! ప్రియతమా! ప్రాణేశ్వరా!" యని సంబోధించుచు నా శవముపైఁబడెను. కన్యయగు రాకుమారి యజయుని ప్రాణేశ్వరా యని పిలుచుట యచటివారి కాశ్చర్యముఁ గొలిపెను. అప్పుడు మానవతి బిగ్గఱగా, "జనులారా! వినుఁడు. నేనిదివఱ కెవ్వరికిని జెప్పని విషయమును మీకుఁ జెప్పుచుంటిని. అజయునకును నాకును నిదివఱకే పరిణయమైనది. కాని మీ రా విషయము నెఱుఁగరు. మా తలిదండ్రులకే తెలియదు. అది మా యుభయుల యంతరాత్మలకే జరిగిన వివాహమగుట నాకును దెలి

యదు. అజయుఁడు నా భర్త, నే నాతని భార్యను. ప్రాణప్రియా! అజయా! యీదీనురాలగు మానవతిని వీడి నీ వెచటి కేఁగితివి? ఆనాఁడు భీషణరణరంగమున, నిశీధిసమయమున, నా గాఢాంధకారములో నీవు నా ప్రేమను యాచించి, యతి దీనవదనముతో నా కారుణాకటాక్షవీక్షణమున పేక్షించిహృదయతాపమునొందుచున్నతఱి,నీతోనొక్క మాటయైన మృదువుగమాటలాడకపోతిని గదా! విశ్వప్రేమయుతమును, నతి విశాలమును నగు నాహృదయమును నీవ్యక్తిగత ప్రేమపాశములతో బంధింపఁదలఁచితివా" యని నిష్ఠురముగఁ బలికితిని. ఇందువలన నీవు నాపైఁగోపించి, నాకు గర్వభంగ మొనర్చి వెడలిపోతివా ? అజయా ! నేఁడు నీపాదములపైఁబడి, నాహృదయమున నీపైఁగల ప్రేమనుజూపఁగోరుచున్నాను. నేనుఇప్పుడునీతో నా నాఁడు ప్రగల్భములాడిన గురువునుగాను. నా యహంకార మణఁగినది. దయామయినగు రాకుమారినిగాను. ఇప్పుడు నీ ప్రేమభిక్షను దీనముగా యాచించు నబలను. అజయా! అకాలమృత్యువు నోటఁబడుదువని యెఱుఁగక యింతకముందే నా ప్రేమను నీకుఁ దెలుపనందుకు క్షమింపుము. అయ్యో! యిదియేమి! నాలోనొక ప్రఖరజ్వాల బయలుదేరు చున్నది. నాతలతిరుగుచున్నది. నేనెచట నుంటినో తెలియుటలేదు." అని శోకోన్మత్తయై విలపించుచుండెను.

అంతట సుభాషిణియు, గోవిందుఁడును, "రాజకుమారీ! అజయునిమృతికై శోకింపకుము. దీనులరక్షింప నతఁడు ప్రాణంబుల నర్పించి చరితార్థుఁ డయ్యెను." అని యామె నూరడించుచుండిరి. కాని శోకానల మామె హృదయమును దహించుచుండెను. దుఃఖము నాపుకొనలేక మానవతి మూర్ఛిల్లెను.

అంతట మంగళయు శూన్యమానసయై విభ్రాంతిఁజెంది యుండెను. భూమ్యాకాశము లామెకు గోచరించుటలేదు. తా నచట నేల యుండెనో, తా నెవరో, యది యే లోకమో యామెకుఁ దెలియలేదు. "సోదరా! సోదరా" యనుచు నామెయు మూర్ఛఁ నొందెను.

ఇఁక గోవిందుఁడు, "నాపుత్రరత్నము మరణించెను. నా పుత్రిక మృతి నొందుచున్నది. నా జీవనసర్వస్వమగు మేవాడు జనని మహాప్రళయమున మునుఁగుచున్నది. అదిగో! మునిఁగినది. ఇఁక నేను జీవింపనేల? ఆమెతో నేనును బోయెద"నని కేకలు వేయుచు మేవాడు వీధులఁ బడి పరుగిడెను.

## ఘోరకృత్యము

అయ్యది సంధ్యాసమయము. దివాకరుఁడు పగలెల్ల నిరాడంబమగు నభోమార్గంబునఁ దిరిగిన తాపము వాపుకొన పశ్చిమాంబుధిఁ గ్రుంకునట్లుండెను. పశుపక్ష్యాది సమస్తజీవరాసులును దమ తమ నెలవులఁ జేరుకొనుచుండ. చీఁకటి శరీరమందలి యవయవములను బూయుచున్నట్లును, నభము కాటుకను గురియుచున్నట్లు గన్పించెను. కాపురుషునకుఁ గావించిన సేవవోలె దృష్టి నిష్ఫలత్వము నొందెను. సృష్టి యంతయు విశ్రాంతి కున్ముఖమగుచుండెను.

అట్టియెడఁ బిచ్చివానివలె రాజమార్గమునఁ బరుగువెట్టుచున్న గోవిందసింహుఁడు మేవాడు కొండలోయలో విడిసిన మహాబత్ ఖానుని డేరాను సమీపించెను. డేరా వెలుపల ఖానుఁడు గజసింహునితో మాడలాడుచుండ, గోవిందుఁ

డాయాసపడుచు నాకస్మికముగా నాతని యెదుట నిలిచెను. ముగల్ సేనాని వానిని గని యిట్లు ప్రశ్నించెను.

మహా:—అయ్యా! మీ రెవరు? ఇచటికి రాఁగతంబేమి?

గోవింద:—మహానుభావా! మేవాడు ధ్వంసమగుచున్నది. అది పూర్తిగా శత్రువుల వశము కాకపూర్వమే చావఁదలఁచితిని. వయోవృద్ధుఁడను. నాకు జీవితేచ్ఛ లేదు. యుద్ధము చేసి మీబోటి మహాయోధుని చేతిలోఁ గడతేర నిశ్చయించుకొని యిటకు వచ్చితిని.

ఎదుట నున్నది తన మామయగు గోవిందసింహుఁడని మహబత్ ఖానుఁ డెఱుఁగఁడు. మేవాడులోని దేశభక్తుఁడొకఁడు మాతృభూమి వినాశమునకుఁ గుంది, యిట్లు పిచ్చివాఁడై ప్రలపించుచుండెనని తలఁచెను. అప్పుడు వారిద్దఱికి నిట్లు సంభాషణ జరిగెను.

మహబత్ ఖానుఁడు:— అయ్యా! మీకు మతిచెడినట్లు కన్పించుచున్నది. మీప్రాణమును మీరుపొందు. ఇట్టి సాహసమునకు దిగకుఁడు.

గోవింద:—నామతి స్థిమితముగనే యున్నది. నేనుపిచ్చివాఁడఁ గాను. ద్వంద్వయుద్ధమున నిన్నుఁ జంపవచ్చితిని. కాని నా బలమంతయు నుడిగినది. ఇప్పుడు నిన్ను యుద్ధమున గెల్చి వధింపఁజాలను. మేవాడును రక్షింపఁగల శక్తి నాకిపుడు లేనేలేదు. కావున నీ కత్తికి బలియగుటకు సిద్ధముగ నున్నాను.

మహా:—మీకోరిక మిగుల నాశ్చర్యకరముగ నున్నదే!

గోవింద :- ఇందు కాశ్చర్యపడనేల ? స్వర్గస్థులగు మహారాణా ప్రతాపసింహుని పక్షమున నెన్నియో యుద్ధములలోఁ బాల్గొంటిని. నా కాయమంతయు గాయములతో నిండి యున్నది. కావునఁ గడకు నీచేతిలోఁ జావగోరుచున్నాను.

మహా :- దానివలన మీకుఁ బ్రయోజనమేమి ?

గోవింద :- నీవు ముసల్మాను ధర్మమును స్వీకరించినను జన్మతః హిందువుఁడవు. మీఁదుమిక్కిలి నా ప్రభువగు రాణా యమరసింహుని సోదరపుత్రుఁడవు. నీచేతిలో మరణము నాకు గౌరవప్రదము. ఇదియే నే నపేక్షించు లాభము.

మహా :- ఏమీ ! మీరు సాలూంబర నరేశులగు గోవింద సింహులా ?

గోవింద :- అవును. మహాబత్ ఖాను ? గుర్తించితివా ? ఇప్పటికి నీవు మేవాడును జయించి, ధ్వంసము చేసితివి. నేను జీవించియుండగా నిన్నుదయపురదుర్గమున నడుగు పెట్టనియ్యను. ఇప్పుడు మేవాడులో నేనుదప్ప మఱియొక వీరుఁడెవ్వఁడును లేఁడు. నేనే యంతిమవీరుఁడను. మేవాడులో సేన లేనందున నీకు యుద్ధము చేయఁబనియుండదు. మొగలులుదయపుర దుర్గమునఁ బ్రవేశింపకుండ నాపఁగలవాఁడీ గోవిందసింహుఁడే. మొగల్ సేనానీ ! ఇతని జంపకయే నీవుదయపురి నాక్రమింపఁజాలవు. కావున నాయుధము చేతఁబట్టుము. నీ చేతిలో నేనేల చావఁదలఁచితినో ఇప్పటి కైన దెలిసినదా ?

ఇట్లు ధీరోక్తులాడుచు గోవిందుఁ డొరనుండి కత్తిదూసెను.

మహ :- యోధాగ్రేసరా! నే నా దుర్గమున బ్రవేశింపఁగోరుటయే లేదుకదా! నీ కెందు కా చింత?

గో :- నీవు దుర్గము నాక్రమించిన నా కేమి? ఆక్రమింపకున్న నా కేమి? ఆ విషయము నా కక్కఱలేదు. ఖడ్గమును గైకొనుము.

మహ :- అయ్యా! వేగిరపడకుఁడు. నామాట నాలకింపుఁడు.

గో:- నీమాటల వినను. నా హృదయమునఁ బ్రళయానలము విజృంభించుచున్నది. సుతుఁడు గతించెను. కూఁతురు స్మృతి లేక పడియుండెను. నేను జావసిద్ధముగ నుంటిని. స్వతంత్ర రాజ్యమగు మేవాడు ముగలుల స్వాధీనము కాకముందే ప్రాణములు విడువఁదలచితిని. నీవు నాయల్లుఁడవయ్యును నా పుత్రుని జంపించితివి. మా దేశమునజన్మించి, మాజాతికిఁ జెందినవాఁడవైనను బరులకు దాసుఁడవైతివి. మా ధర్మమునకు సంబంధించియుండియు, పరధర్మము నవలంబించితివి. మా రాజునకు సోదరుఁడవైనను, నాతనికిఁ బరమవిరోధివైతివి. అట్టి ఘనుఁడవగు నీ చేతిలో మరణింపఁ గోరితిని. ఆలసింపకుము. సందేహము విడువుము. ఖడ్గముఁ జేతబట్టుము. నన్ను జంపుము. నీవు నా మీఁదికి రాకున్నను, నేను నిన్ను విడిచిపెట్టను. ఇప్పుడే నేను చావవలయును. ఇది తప్పదు. కత్తిపట్టుము" అని గోవిందుఁడు కత్తిత్రిప్పుచు నాతనితోఁ బోరాడఁబోయెను.

ఇంతలో మహబత్ ఖానుని వెనుకఁ బొంచియున్న గజసింహుఁడు గోవిందసింహునిపైఁ దుపాకికాల్చెను. ఆగుండు దెబ్బ వృద్ధగోవిందుని వక్షంబును భేదించుటచే నాతఁడు నేలపై

గూలెను. ఖానుఁడు చకితుఁడై వెనుకకుఁదిరిగి, "మహారాజా! యిదియేమి? ఈ వీరవరుని నేను జంపలేకయా? నీ వేలచంపితి" వని క్రోపముతో నడుగ, నా ఘోరకృత్యమునకుఁ బాల్పడిన యా గజసింహుఁడు, "ఇంతదనుక ప్రగల్భములాడుచు మీ పైఁ గలియఁబడుచున్న వీఁడొక బందిపోటు దొంగయని భావించి వీనిని జంపితి"నని పలికెను.

అనవుడు మరణించుచున్న గోవిందుఁడు, "తుచ్ఛుఁడా! దేశద్రోహీ! గజసింహా! చోరుఁడను నేనుగాదు. నీవే చోరుఁడవు. పరులరాజ్యము నపహరింపవచ్చినది నీవుకాని నేను గాదు. మహబత్ ఖాన్! ఇఁక నీ వుదయపుర దుర్గము నాక్రమింపుము. నిన్నడ్డగించువా రెవ్వరునులేరు. నీ మేవాడ్ జనని నిబట్టి పీడించి ముగలులకు దాసిగఁ నొనర్పుము! పుత్రుఁడవై నందుకు నీవిధిని నిర్వర్తింపు!"మని కడసారిమాటలాడి, తన యుజయుని, మంగళను స్మరించుచుఁ బ్రాణములఁ బాసెను.

## అతిథిసత్కారము

మాతృభక్తియు, దేశభక్తియుఁ బ్రతిమానవుని హృదయమందును నంతర్గతములై యుండును. "ఇది నాజన్మభూమి"యని యొకప్పుడైనను నభిమానపూర్వకముగఁ బలుకని మనుజుఁడు సాధారణముగ నుండఁడు. అట్టివాఁ డేదేశముననైన నుండిన వాని యంతరాత్మ మృతప్రాయముగ నున్నదనవచ్చును.

మహబత్ ఖానుఁడు పరులకు దాసుఁడై పరధర్మము నను ష్ఠించుచున్నను బ్రత్యక్షముగఁ దనమాతృభూమియగు మేవాడు నాక్రమించుట కెట్లు సమ్మతించును? తాను మేవాడుపై నెఁక

యుద్ధము చేయనని యతఁడు బాదుషాకుఁ దెలియఁజేసెను. అందుమీఁదట పాదుషా తన కుమారుఁడగు ఖుర్రమును యుద్ధము సాగించుటకుఁ నియమించెను. కాని ఖుర్రము రాణా యమరసింహునితో సంధిఁ జేసికొనుటకు (వ్యాజమున) నొక దూత నాతని కడకుఁ బంపెను. మఱునాఁ డుదయము రాణా యశ్వారూఢుఁడై, వెంట సేననైనఁ దోడ్కొనక యొంటరిగా షాహజాదా ఖుర్రము డేరా వైపునకు వెడలెను.

ముగల్ సేనను వెంటఁబెట్టుకొని యుదయపుర దుర్గమునఁ బ్రవేశింపుమని యెంతచెప్పినను మహబత్ ఖాను వినకందున, గజసింహుఁడు దేశాభిమానశూన్యుఁడై తానే స్వయముగ దుర్గప్రవేశముచేయఁ దలపెట్టెను. ఈసారి మేవాడులోని స్త్రీలు సయితమాయుధములధరించి యుద్ధమునకు సంసిద్ధులగుచున్నా రని వినియు గజసింహుఁడు సిగ్గులేక వారితోఁ బోరాడఁ దలంచెను. అట్టివానిలో మానవత్వముకూడ లోపించెనా యని యెవరికైన సంశయ మొదవక మానదు. ముగల్ జాతికిఁ జెందిన ఖుర్రము తనసేనతో నుదయపురిని బ్రవేశించుట సహజమేకాని, రాజపుత్రుఁ డగు గజసింహుఁడు ముగల్ సేనను వెంట నిడుకొని యాపురప్రవేశము చేయుట ధర్మవిరుద్ధమనియు, మేవాడును నాశనము చేయుటతోఁ దన పని పూర్తియయ్యె ననియు మహబత్ ఖాను భావించెను.గజసింహుఁడు తన శౌర్యమును స్వదేశ రక్షణకై యుపయోగించిన నెంత బాగుండెడిది.

కాని విధిప్రేరితుండై గజసింహుఁడు చాలమంది ముగలు సైనికుల వెంటఁబెట్టుకొని యుదయపురదుర్గరక్షకునితో, "ఓరీ! యీదుర్గముమాది. దీనిలో మేముప్రవేశింపఁ గోరుచున్నాము. కావునఁ గోటద్వారమును దెరువుము." అని గద్దించెను.

అందు కా సైనికుఁడు తన ప్రభువగు రాణా యమరసింహు నాజ్ఞ లేనిదే ద్వారము తెఱవననెను. ఇప్పు డాతని ప్రభువు రాణా యమరసింహుఁడు కాఁడనియు, తానే ప్రభువనియు గజసింహుఁ డెంతచెప్పినను స్వామిభక్తిపరాయణుఁడగు నా సైనికుఁడు కంఠమునఁ బ్రాణములుండఁగఁ గోట తాళముచెవి వారి కీయననెను. అప్పుడు గజసింహుఁడు, "సైనికులారా! కోట తాళపుచెవిని వీనిదగ్గఱనుండి లాగివేయుఁ" డని యాన తీయఁగా నా దుర్గరక్షకుఁ డొఱనుండి కత్తిని లాగి, వారితోఁ బోర సిద్ధపడెను. అంతట గజసింహుఁడు, "వీనిని జంపివేయుఁ" డని సైనికుల కాజ్ఞాపించగనే యచట నిల్చియున్న పౌరులందఱు నేకమై గజసింహునిపైఁ బడిరి. వెంటనే గజసింహుని సిపాయి లాపౌరులపై దాడిచేయఁబోవుచుండఁ, జాలమంది ముగలు సైనికుల వెంటఁబెట్టుకొని రాణా యమరసింహుఁడు ప్రవేశించి, "సైనికులారా! యుద్ధము చాలింపుఁ" డని యాదేశించె. ముగల్ సైనికులఁ గాంచి, రాజపుత్రులు యుద్ధమును విరమించిరి.

అచటికి గజసింహుఁడు దుర్గమును బ్రవేశింప వచ్చియున్నాఁ డని రాణా యాతనివలననే తెలిసికొని, యతనితో, "రాజా! ఇప్పుడు నీవు నా కతిథివి. నేను నిన్నుఁ దగినరీతిని సత్కరింప వలయు. పరులకు లోనిస్వై దేశమునకు ద్రోహము గావించిన నీ కిదియే తగిన యతిథిసత్కారమని యెత్తిపొడుచుచు, నాతని నొక్కతన్నుఁ దన్ని క్రిందఁబడవైచెను. పిమ్మట రాణా దుర్గరక్షకుని సాహసము నెంతయో కొనియాడి, తానాజ్ఞాపించిన మీఁదట నాతఁడు దుర్గద్వారమును దెఱవగనే, తనవెంటవచ్చిన సైనికులను వారిస్థానమునకుఁ బంపివేసి, దుర్గమునఁ బ్రవేశించెను. దుర్గద్వారము వెంటనే మూయఁబడెను.

# మత సహనము

మేవాడురాజ్యముపై నొక పిడుగుపడి సర్వము నాశన మొనర్చినట్లుండెను. దానిభాగ్యము తొలఁగిపోయెను. అచటి ప్రజల యాశాకాంక్షలు భగ్నము లయ్యెను. ఎనిమిదివందల సంవత్సరములనుండి యెగురుచున్న యరుణపతాకము నేఁడు మేవాడుశిఖరముపై నెగురుటలేదు. దేశమంతయు నంధ కారమున మునిఁగినట్లుండెను. ప్రకృతి సమవేదనను ప్రదర్శించుచుండెనా యనినట్లు పక్షులు మధురముగఁ గూయుటలేదు. భ్రమరములు పుష్పములలోని మకరందము నాస్వాదించుటలేదు. చంద్రుఁడాహ్లాదకరముగఁ బ్రకాశించుట లేదు. మందానిలములు వీచుటలేదు. నదులు జలశూన్యము లైనట్లగపడెను. ఆనందోత్సవములు కలలోని వార్త లయ్యెను. స్త్రీపురుషు లాపత్సముద్రమున మునిఁగినట్లు విల పించుచుండిరి. రాజపుత్రుల శస్త్రగవములు వినవచ్చుటలేదు. సుందరాంగులు దుఃఖపరవశలగుటం జేసి యమూల్యములగు వస్త్రభూషణాద్యలంకారములఁ బరిత్యజించిరి.

మేవాడు పర్వతములలో సంచరించుచుఁజాలమందిచారణులు మేవాడుపతనమునుగూర్చి సంతాపజనకముగఁ బాడుచుండ, హిందాయతు అలీఖాను సైనికపరివృతుండై ప్రవేశించి; 'చారణు లారా! యీరాజ్యము ముగలులవశమైనది. ఇఁక మీఁదట మీరిట్టి యుద్రేకపూరితములగు గీతములఁ బాడ వీలుపడదు. ఇంతటితో మీ పాటలఁ గట్టిపెట్టుఁ''డని కఠినముగ శాసించెను.

ఆ చారణులతోఁ బాటుగఁదిరుగుచున్న సుభాషిణి సవినయ ముగ నాతనితో, ''అయ్యా! ముగలు పాదుషాకు జయమగు

గాక ! ఇంతకాలము మేవాడు స్వాతంత్ర్యమునకై పోరాడితిమి. ఇప్పుడు ముగలులయధికారమును శిరసావహించితిమి. వారితోఁ నిఁక మా కెట్టి వివాదమును లేదు. కాని మా దేశపతనమునకై మేము విలపించుట నేరమా ? ముగల్ యోధవరా ! మాతృభూమిని ప్రేమింపనివాఁ డుండునా? అదృష్టహీనయగు మేవాడ్ జననికిని మాకునుగల ప్రేమబంధమును నేఁటితోఁ ద్రెంచివేసికొనవలెనా ?" యని యడిగెను.

ఏమైనను సరియే వారాగీతమును బాడరాదని హిదాయతు మార్గపుపట్లు పట్టెను. కాని సుభాషిణి వెంటఁ దిరుగుచున్న దేశభక్తిపూరితుఁడగు నరుణకుమారుఁ డాపాటనే పాడెదనని గట్టిగా నొక్కి చెప్పెను. అందు కా హిదాయతుఖాను కినుక వహించి వారిని బందీలుగాఁగొనిపోదు నని బెదరించెను, కాని వా రాతని యాజ్ఞనుల్లంఘించి, బందిగంబునకైన నాపాట పాడుచుండెదమనిరి. అంత నా ఖాను కోపమునాపుకొనలేక వారిని బంధింపఁబోవ, నరుణబాలకుఁడు నిజకరవాలంబునుజూపి, "నీవు నా తల్లిజోలికిఁ బోయినఁ బ్రాణములు నీకుదక్క" వని ధైర్యముగాఁ బలికెను. హిదాయతుఖా "నీబాలకుని వధింపుఁ" డని తన సైనికుల నాజ్ఞాపింప, వారాతని జుట్టుముట్టిరి. కాని కొదమ సింగంబుచాడ్పున నాయరుణసింహుఁడునిర్వక్రపరాక్రమముతో వారిపై విక్రమించెను. మాతృరక్షణకై పోరుచున్న తనయుని శౌర్యమునకామె మిగులసంతసించెను. అరుణునిధాటి కాగలేక యొక ముగల్ సైనికుఁడు గాయపడి నేలఁగూలెను. అదిచూచి సుభాషిణి, "నాయనా ! ప్రాణములుండగా ఖడ్గమును విడువకుము" అని యాతని బ్రోత్సహించుచుఁ బరమానంద భరితయయ్యెను.

కాని హిదాయతుఖానుఁ డిది చూచి సహింపలేక తాను స్వయముగ నాతనిపైకి యుద్ధమునకుఁబోయెను. మొగల్ సైనికు లిద్దఱుకూడ నాతనిపైఁబడిరి. ఇఁక నిజముతునిమృతి సమీపించినదని గ్రహించి సుభాషిణి యది చూడఁజాలక యొకింత సేపు తనకన్నుల మూసికొనెను.

అట్టి విషమపరిస్థితిలో సైనిక సమేతుండై మహబత్ ఖాను ప్రవేశించి హిదాయతుని బోరుచాలింపుమని యానతిచ్చెను. అంత నందఱును యుద్ధమును విరమించిరి. ఇద్దఱు పెద్దవాండ్రొక బాలునిపై యుద్ధము చేయుచుండ హిదాయతు కూడ వారితో నేకమైనందులకు మహబత్ ఖా నతనిని గఠినముగా మందలించి, ప్రాణములనైన లెక్కచేయక ధైర్యముగఁ బోరుచున్న యా బాలకుని శౌర్యమును బ్రశంసించి, "చిరంజీవివై వర్ధిల్లు" మని దీవించెను.

ఇంతవఱకును బుత్రుని పరాక్రమమును గాంచి సంతసించుచున్న సుభాషిణి మహబత్ ఖానుని వంకఁజూచి యేమియు మాటాడఁజాలక తలవంచుకొనెను. మహబత్ ఖానుఁ డామెం గని, "సోదరీ! నీతో నేమనుటకును నాకు నోరురాకున్నది. నిన్ను సోదరీ యని పిలుచుటకును నా కధికారము లేదుకదా! నన్ను మన్నింపుము." అని వేడుకొనెను.

సుభాషిణి తనతమ్ముఁడు తన్ను 'సోదరీ'యని పిలుచుచుండ నాతనిపైఁగల ప్రేమ నెట్లు తీసివేసికొని పలుకక యుండఁగలదు! అట్టియెడ నరుణుఁడు "అమ్మా! వీరెవరు?" అని యడిగెను. అందుకు సుభాషిణి "యీయన మొగల్ సేనానియగు మహబత్ ఖానుఁ"డని బదులుచెప్పెను. మహబత్ ఖానుఁడు "అబ్బాయీ!

నేను నీ మేనమామ"నని చెప్పుకొనఁగ నే, సుభాషిణి తనపుత్రు నితో సహా యచటినుండి వెళ్ళఁబోయెను. అప్పుడు మహాబత్, "సోదరీ! ముందు నన్ను క్షమించి తరువాత వెళ్ళు"మని బ్రతి మాలెను. అందుకు సుభాషిణి, "మహాబత్ ఖాను ! నీ వెన్ని పాపములఁ జేసియుంటివో యెఱుఁగుదువా?"య నెను. మహాబత్ ఖాను తన చేతిమీఁదుగా నెన్ని యో గృహంబులఁ దగులఁ బెట్టి, వానినుండి వెలువడు పొగనుగాంచి, పైశాచికానందము ననుభవించితిననియు నది తప్పే యనియు నొప్పుకొనెను. సుభాషిణి, "నీ వింకేమియుఁ జేయలేదా ?" యని యడుగ, నతఁడు, "ఇంకేమి చేసితిని ? నేను ముసల్మానునగుట పాప మని యొప్పుకొనను ? ప్రతివ్యక్తికిని దన యిచ్ఛవచ్చిన మతము నవలంబించుటకు స్వాతంత్రము కలదు కదా !" యని పలుక, నామె కామాట రుచింపనందున నరుణునితోఁ గలిసి వెళ్ళ నుంకించుచుండెను. మహాబత్ ఖానుఁడు, "ముసల్మానగు టయే పాపమని యొకవేళ నీవు భావించినను, నంతమాత్రము ననే మానవహృదయమందలి కోమలప్రవృత్తులన్నియు నొక్క మాఱుగ నశించునా ? సోదరీ ! స్త్రీల హృదయములు సహజ ముగాఁ గోమలములైనవి. అట్టియెడ నీవు నాపై నింత కాఠి న్యము వహింపఁజనునా ? నీవు హిందువ వనియు నేను మహా మ్మదీయుఁడ ననియు, నీవు హింసితవనియు నేను హింసకుండ ననియు, క్షణకాలము మఱచిపొమ్ము. నీవును నేనును మానవ జాతికిఁ జెందిన వారలమనియు, నీవు నా సోదరివి, నేను నీ సోదరుఁడనియు మాత్రము జ్ఞప్తియం దుంచుకొనుము. నేను బాలుఁడనై యున్నప్పుడు నన్నెంత గారాబముగఁ బెంచితివో స్మరింపుము! మనమిద్దఱము తల్లిలేని బిడ్డలమని మఱవకు" మని

సంతాపకరముగ వారిబాల్యస్మృతులను జ్ఞప్తికి దెచ్చెను. అంత నామె శోకవివశయై, "తమ్ముఁడా ! నీ యపరాధముల క్షమించితిని. భగవంతుఁడును నిన్ను క్షమించుగాక ! ఇప్పుడు నిన్ను ముగల్ సేనానియగు మహబత్ ఖానునిఁగ గాక, తమ్ముఁడగు మహీంపతిసింహునిగా భావింతు"నని పలుక, నతఁడు తన సోదరికి భక్తితోఁ బ్రణమిల్లెను. అమెయు నాతని జిరాయువుగా దీవించి, నిజసుతునితో వెళ్ళబోఁవుచుండ, హిదాయతుఁడామెను బుత్రసహితముగ బంధింపఁ నుద్యుక్తుఁడయ్యెను. కాని మహబత్ ఖానుఁడు, "ఏమీ ! నా సోదరిని నాయెదుటనే బంధింతువా ? జాగ్రత" యని యాతని గద్దించెను. అంతకు హిదాయత్, "ఖానుసాహేబ్ ! మీరిపుడు మాకు సర్వసేనాని కారు. కావున మీ మాటను నేను మన్నింపను. షాహజాదా ఖుర్రం మా కిపుడు సర్వసేనాని "యని తిరస్కారభావముతోఁ బలికెను.

ఇట్టికి షరిస్థితిలో దైవవశమున షాహజాదా ఖుర్రము ప్రవేశించి, సుభాషిణికి, "మీరు మీయింటికి యథేష్టముగ వెళ్ళవచ్చును."అని స్వయముగ నాజ్ఞయిచ్చెను. కాని హిదాయతు, "షాహజాదాసాహబ్ ! ఈమె తన పాటవలనఁ బ్రజలలోఁ దిరుగుబాటు లేవఁదీయుచున్నది." అని యామెపై గొండెము చెప్పెను. అందుకు ఖుర్రము, "నేనీపాటను దూరము నుండి వినుచుంటిని. ఇది కేవలము నిరాశాదుఃఖములతోఁగూడి యున్నది. ఇది యామె పాడినందువలన మనకు నష్టమేమి ?" యని యడుగ, నాతఁడు "మహాప్రభూ ! ఇట్టి పాటలవలన దేశశాంతికి భంగము వాటిల్లు"నని చెప్పెను. అనవుడు ఖుర్రము "దేశభక్తి పూరితములగు నిట్టి గేయములు. కేవలము

మేవాడులోనే కాదు, హిందూస్థానమంతటను బాడినను ముగల్ సామ్రాజ్యమునకు భయములేదు. ఈ సామ్రాజ్యము హిందువుల ప్రేమపూర్ణమగు సహకారముపై నాధారపడియున్నది. ఎవ్వఁడైనఁ దన దేశమును బ్రేమతోఁ బూజించినను, దాని ఘనతను గీర్తించినను నాతనిని మనము నిరోధింపనేల? ఇందతని నేరమేమి? ఇంతమాత్రమునకే మన సామ్రాజ్యమునకు ముప్పు వచ్చునా?" యని హిదాయతును గట్టిగా మందలించి, సుభాషిణితో, "సోదరీ! మీ రా పాటను మరలఁ బాడుఁడు. మీరు దానిని బాడుచుఁ దిరుగుచున్నందుకుఁగాదు కాని, నేఁడు మేవాడులో నా పాటను వినుట కెవ్వరును సజీవులైయుండ నందుకు నేను విచారపడుచున్నాను. నిర్భయముగాఁ బాడుఁడు. నేను వినెదను. మీ దేశపుఁ బ్రాచీన గౌరవ గాథలను విన నాకుఁ గుతూహలమయ్యెడిని. మీ రందఱుఁ బాడుఁడు. నేనుఁగూడ మీతోఁ గలిసిపాడెదను. హిదాయతుఅలీ, నీవును, దక్కిన సిపాయిలును గూడఁ బాడుఁడు." అని యాజ్ఞాపింప నచటనున్న వారందఱును మనోహరయగు నా గేయముం బాడిరి.

## రాజ్య పతనము

అజయుని మరణము ఝంఝామారుతంబు పగిది మానవతీ మానససరోవరమును సంక్షుబ్ధము గావించెను. ప్రకంపనవిజృంభణానంతరము సాగరజలంబులు శాంతించినట్లు, కొంతవడికి నామె మనంబును శాంతించెను. కాలమేఘవిరహితమైన గగనంబు చందంబున నామె డెందంబు నిర్మలంబయ్యెను. జీవిత

ములో వచ్చు సాధారణసుఖదుఃఖముల నతిక్రమించి యామె కర్తవ్యమార్గము విశ్వవ్యాప్త మగుచుండెను.

మంగళ దుఃఖమునకు మేరలేదు. వెనుకటి కష్టములటుండ, నామె తండ్రియును ఘోరమృత్యువునోటఁబడెను. శోకతాపము నాపుకొనలేక, కొంతయూరట కల్గునను నాసతో నామె మానవతి కడకు వచ్చెను. అది మానవతిగ్రహించి, "మంగళా! దుఃఖము నన్ను వశపఱచుకొనఁ జూచెనుగాని తుదకు నేనే దుఃఖమును వశపఱచుకొంటిని. కాంచనం బగ్నితప్తమై నిర్మలం బును, గాంతిమంతమును నగునట్లు, నాహృదయంబు శోకానల తప్తంబై, యమలంబును, దేజోవంతంబును నయ్యెను. ఇప్పుడు పరులసుఖమునకై యనుభవించు దుఃఖము దుఃఖముకాదనియు, నదియే వాస్తవికసుఖమనియు ననుభవపూర్వకముగ గ్రహించి తిని. మంగళా! నీవు నాకుఁ దోడ్పడుము. మనమిద్దఱముఁ గలిసి మానవకళ్యాణమునకై మనజీవితముల నర్పించుదము. అప్పుడు 'మంగళ' యను నామము నీకు సార్థకమగు" నని యామె కుపదేశించె.

"సూర్యే తప త్యావరణాయ దృష్టేః కల్పేత లోకస్య కథం తమిస్రా" యనినట్లు మానవతి యుపదేశమువలన మంగళ హృదయాకాశంబున జ్ఞానభానుఁడు ప్రకాశించుచుండ శోకనిశా సంజాతమైన యజ్ఞానాంధకార మిపుడామె జ్ఞానచక్షువు నెట్లు కప్పివేయఁగలదు? మానవసేవాతత్పరురాలికి దుఃఖ మెట్లుండఁ గలదు ?

ఆనాఁడు మంగళ మహబత్ ఖానునితోఁ గఠినముగ మాట లాడి తనకాతనిపైఁగల యేవగింపును వెలిబుచ్చి వచ్చెనుగాని,

చిరకాలమునుండి యీతనిపైఁ దనకుఁగల ప్రేమ యామెను విడువలేదు. నిరాశాజనకమైన ప్రస్తుతపరిస్థితిలోఁగూడ నతనిని గూర్చిన చింతయే రావణుని చితివలె నామె హృదయమునఁ బ్రజ్వరిల్లుచుండెను.

ఇప్పు డా వ్యక్తిగతమగు విశుద్ధప్రేమను మహాబత్ ఖాను సందేశాళి యఖిల మానవజాతియందును వ్యాపింపఁజేసినచో నామెకు మనశ్శాంతి కల్గుననియు, విశ్వప్రేమ ప్రతిఫలము నపేక్షింపదనియుఁ బాత్రాపాత్రవిచక్షణ చేయదనియు, నది మానవసేవలోనే యానందము ననుభవించుననియు మానవతి మంగళకు బోధించెను.

ఇంతలో సుభాషిణి ప్రవేశించి, "ఖుఱ్ఱము రాణాకుఁ బంపిన లేఖలో వెలిబుచ్చిన స్నేహభావము హృదయపూర్వకముగ వెలువడినది కానందున నయ్యది గగనకుసుమంబునవలెను, మృగతృష్ణవలె సిద్ధమయ్యె"నని వారికిఁజెప్పె. వెండియు నామె "సమబలవంతులకు మైత్రిపొసఁగునుగాని సింహమునకును మేఁకకును స్నేహము కుదురునా? రాణా కోట వెలుపలికివచ్చి తన యాజ్ఞను గైకొనవలెనని ఖుఱ్ఱము కోరెను. రాణా ప్రతాప సింహుని కుమారుఁ డిట్టి యవమానమును సహించునా? అవమానము కంటె మరణమే మేలనియెంచి, తన సామంతుల నందఱఁ బిలిపించి, తన పుత్రుని సింహాసనాసీనుని గావించి, రాజ్యభార మాతని కప్పగించెను. ఇఁక రాణా రాణితోఁగూడి వనంబున కేగ నిశ్చయించె. ఇఁక నేటితో మేవాడు పతన మయ్యె" ననియు నుడివెను.

# ప్రేమవిజయము

రాణా యమరసింహుఁడు తన మీఁదుగా మేవాడు పతన మైనందుకుఁ జాల విచారపడుచుండెను. ఆనాఁటి సాయంసమ యమున మేఘావృతంబైన నభంబు క్రోధాతిరేకమున గర్జించు చున్నట్లును, మేవాడు పర్వతము లవమానమును భరింపలేక ముఖమును గప్పివేసికొన్నట్లును,నుదయసాగరము సంక్షోభితమై తీరముల డీకొనుచున్నట్లును, కులదేవతలు కినుక వహించి పరాఙ్ముఖులైనట్లును నతనికిఁ దోఁచుచుండె.

ఆనాఁడే రాణా మహబత్ ఖానుని దన చెంతకుఁ బిలిపించెను. అంతట వారిద్దఱికి నిట్లు సంభాషణ జరిగెను.

రాణా :- మహబత్ ఖాఁ ! నేను నిన్నొక్క పనిమీఁదఁ బిలిపించితిని. ఆ పని నీవలననే కావలసియున్నది.

మహ :- మహారాజా ! ఆ పని యెద్దియో సెలవిండు.

రాణా :- మహబత్ ఖాఁ ! ఒక్కసారి నావంకఁజూచి నేను నీ కేమగుదునో చెప్పుము.

మహ :- మహారాజా ! మీరు నాకు సోదరులు.

రాణా :- మంచిది. నీవు నాకు సోదరుఁడవైనందుకు నీ పితృభూమియు, మాతృభూమియునగు మేవాడును మొగలుల ద్వారా ధ్వంసము గావించి నీ ధర్మము నీవు నిర్వర్తించితివి. మేవాడు నందలి సోదరరాజపుత్రుల రక్తముతో నీ హస్తము లరుణములైనవి.

మహ :- మహారాణా ! నేను బాదుషా కొలువులో నుంటిని. ఆతని పక్షమున యుద్ధము చేయుట నావిధి కాదా ?

రాణా :- మంచిది. నీవు నీవిధిని జక్కఁగా నెఱవేర్చితివి. ఈ విషయమై నీతో వాదమేల ? మతాంతరుఁడవై, పరుల యెంగిలి కాశపడిన నీకుఁ దగనిపని యేమికలదు ? నీవు మేవాడును సర్వనాశన మొనర్చితివి. ఇంకొక్కపని మిగిలి యున్నది. మేవాడు రాణానుగూడా సంహరింపుము. ఇది యును నీకు యోగ్యమే. ఇదిగో ఖడ్గము. ఆలసింపక యందుకొనుము.

మహ :- మహారాణా ! యిది యేమి !

రాణా :- నామాట కెదురు చెప్పకుము. నీ కిదివఱకు వచ్చిన కళంకమేమియు దీనివలనఁ బెరుఁగదు. నామాటవిని నన్ను వధింపుము. నీ కిష్టములేని పని యేమియు నేను జెప్పుటలేదు. నీవు నారక్తమును ద్రాగుట కారట పడుచున్నావని నాకుఁ దెలియును. నీ దక్షిణహస్తము నాప్రాణములఁ దీయుటకు దహతహ పడుచున్నది. నన్నుఁ జంపుము.

మహ :- మహారాజా! మహాబత్ ఖానుఁ డింత నీచుఁడుకాఁడు. ఖడ్గముతో జనులను సంహరించియు, నిండ్లకునిప్పంటించియు మేవాడుభూమిని శ్మశానవాటికగ నొనర్చెనేగాని, యధర్మ యుద్ధమును జేయలేదు.

రాణా :- మహాబత్ ? నీవుచేసినది ధర్మయుద్ధమా ! అత్యల్ప సంఖ్యాకులగు మేవాడు సైనికులపై నత్యధిక సంఖ్యాకులగు సామ్రాజ్యసైనికులు దాడిచేయుట ధర్మయుద్ధమందువా ? అది పిచ్చుకపై బ్రహ్మాస్త్రప్రయోగము కాదా! కానిమ్ము. నీవు మేవాడుయుద్ధమున గెల్చితివి. నాతోఁగూడ యుద్ధము

చేసి గెల్చితివేని నీవిజయ మప్పటికి సంపూర్ణమగును. మహారాణా ప్రతాపసింహుఁడు మరణించునపుడు నాకీ ఖడ్గమునిచ్చి, 'దీనినవమానపఱుపకు' మని నా కానతిచ్చెను. కాని యీపవిత్రమైన యాయుధమును నేనగౌరవపఱచితిని. ఆ యపకీర్తిని నా రక్తముతోఁ గడిగివేసెదను.

మహ :– మహారాజా! మహబత్ ఖానుఁడు యోధుఁడు కాని హంతకుఁడు కాఁడు.

రాణా :– సరేకాని యుద్ధముచేయుము. ఇదిగో చేతనున్నది ఖడ్గంబని యెఱుంగుము.

మహ :– మహారాజా! నేను మేవాడుయుద్ధమును మాని వేసితినిగదా!

రాణా :– అది యెప్పటినుండి? ఖడ్గముఁ జేతఁబట్టుము. నేఁడు మేవాడు శశ్మానమునఁ దల్లి శవమును భుజముపై నిడుకొని నిన్ను ద్వంద్వయుద్ధమున కాహ్వానించుచున్నాను. కాచుకొనుము.

మహ :– మహారాజా! ఒక్కమాట వినుఁడు.

రాణా :– నేనేమియును వినను. పితృకిపంద! కులనాశక! యుద్ధముచేయుము. యావద్భారతదేశమును వణఁకించుచున్న నీ శౌరత్వము నీ వీరత్వమును నెట్టివో నేఁడు చూచెదనుగాక! నిన్నువిడువను. అధమాధముఁడా! నరకవాసీ! పిశాచమా!

మహబత్ ఖాను :– మహారాజా! మంచిది. అట్లైన యుద్ధమునే కానింపు. భారతవర్షమున మహబత్ ఖానునకు

నెనయగు యోధుఁ డొక్క రాణా మాత్రమే ! అయినను జాగ్రత్త !

అని పలుకుచుఁ గత్తినిదూసి రాణాపైఁ గవిసెను. అంత నిద్దఱును గత్తులను ద్రిప్పుచు యుద్ధమునకు సిద్ధపడిరి. ఈ సోదరుల మధ్య జరుగనున్న భయంకరయుద్ధ మదృష్టాశ్రుతపూర్వము. ఆనాఁడు భూమిపైఁ బ్రళయము రానున్న ట్లగపడెను.

అట్టి విషమావస్థలో మానవతి నెఱికురుల విరియఁబోసికొని వారిద్దఱిమధ్యకు వచ్చి నిలఁబడి, యా మహాయోధుల నిద్దఱిని "శాంతింపుఁడు, యుద్ధమును మానుఁ"డని వేఁడుకొనెను. కాని రాణా యామెను, "అమ్మాయీ! నీవు నాకడ్డు రాకుము. వెనుకకుఁ బొ"మ్మని గద్దించెను.

మానవతి యంతటితో నిరుత్సాహపడక, "జనకా ! శాంతింపుము. కావలసినంత నాశన మిద్దివఱకే యైనది. దీనికిఁ దోడుగ సోదరులగు మీ యిద్దఱి నాశనముకూడ నెందులకు ? నీ సోదరుని రక్తమును వృథాగాఁ బ్రవహింపఁజేయకుము. హత్యాశోక నివారణోపాయ మెన్నటికినిగాదు. మానవత్వమే దీనికి సరియైన మార్గము.

రాణా :- మానవతీ ! మానవత్వమన నేమి ?

మాన :- శత్రుమిత్రభేదముఁ బాటింపక, ద్వేషమును విడిచి, వ్యక్తిదోషములను, జాతిదోషములను విశ్వప్రేమామృతమునఁ గడిగివేయవలయును.

దేశము నాశనమైనందుకు శోకింపఁడు. దేశమును విడువ నలసివచ్చినను మానవత్వమును విడువఁడు. శత్రువులపైఁ గోపించుట వ్యర్థమైనపని. 'నాకు నేనే విరోధిని. నాలోఁగూడ దోషమున్న'దని మీరెల్లయును జ్ఞప్తియం దుంచుకొనుఁడు. నిరాశాజనకమైనయీపరిస్థితులలో నేదినశించినను, విశ్వమానవ సౌభ్రాతృత్వమును గుర్తెఱింగి పరస్పరసాహాయ్యమును జేసి కొనుఁడు. ఆత్మీయ, పరకీయవిభేదముల విస్మరించి, శత్రువును మిత్రునిగఁ బరిగణింపుఁడు. ఈ జగత్తునంతను మీ గృహంబుగ భావించి, 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబక' మ్మను నార్యోక్తిని సార్థకపఱచుఁడు. శత్రువున్నతాదర్శములు కలవాఁడును, ధర్మతత్పరుఁడును నైనచోఁ బ్రేమపూర్ణమగు హృదయముతో నాతని నాలింగనము చేసికొనుఁడు. ఇదియెంతయో ప్రశంసనీయమైన నీతిసుఁడీ! కపటియు, ధూర్తుఁడు నగువాఁడు మిత్రుఁడైనను వానిని బరమశత్రువునుగా భావింపుఁడు. 'దుష్టం దూరేణ వర్జయే' త్తన్న న్యాయము ననుసరించి యట్టివాని నుండి దూరముగ నుండుఁడు.

ప్రపంచమున దైవాసుర సంపదలకు నిత్యసంఘర్షణ కలదు. అహింస, సత్యము, నక్రోధము, త్యాగము, శాంతి, యపైశునము (చాడీలు చెప్పకుండుట), భూతదయ, నమ్రస్వభావము, ప్రతిభ, యోర్పు, ధృతి, శుచిత్వము, నద్రోహము, మున్నగునవి దైవీసంపత్తులు—కావున వీని నలవఱచుకొనుఁడు. దంభము, దర్పము, దురహంకారము, క్రోధము, కాఠిన్యము, నజ్ఞానము, మొదలగునవి యాసురీ సంపత్తులు. కాన వీనిని బరిత్యజింపుఁడు.

స్వదేశము, సమాజము నశించినను నీశ్వరుని సర్వదా భజింపు(డు. ధర్మ మెచ్చట నుండునో యచ్చట నుండు(డు. 'యతో ధర్మ స్తతో జయః' 'సత్యమేవ జయతే' యను మహా వాక్యములను విస్మరింప( జనదు.

అను మనోహరభావముల వెదజల్లుచున్న యామె పలుకులను విన్నంతనే రాణా యమరసింహు(డు మంత్రముగ్ధునివలె వివశు(డై "ప్రియసోదరా! మహబత్ ఖాన్! నేను క్రోధ పరవశు(డనై నిన్ననరాని మాటలనంటిని. నన్ను క్షమింపు" మని వేడుకొనెను.

మహబత్ ఖాను(డును, "మహారాజా! దురహంకార పూరితు(డనై, యతి కాఠిన్యమువహించి, నీరాజ్యమున నింత హింసాకాండను జరిపించితిని. నా యపరాధమును మన్నింపు" మని రాణాను ప్రార్థించెను.

అంత నుభయులును ప్రేమపూర్వకముగ( బరస్పరాలింగనమును జేసికొనిరి.

సర్వేజనా స్సుఖినో భవంతు.

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి.